# సంస్కృతమహాకవులు

ఉభయభాషాప్రవీణ

చింతలపూడి శేషగిరిరావు, బి. ఏ.




వివేకానంద పబ్లికేషన్సు

మద్రాసు :: తెనాలి

 1956 [వెల : రు. 0-15-0

# 1. వాల్మీకి

శ్రీమద్రామాయణ మహాభారత భాగవతములు మూఁడును హిందువుల కాదర్శ గ్రంథములు. అభిమాన పాత్రములుగూడ. అందును భారతీయ హృదయముల మిక్కుటముగఁ జూఱఁగొనఁజాలిన కావ్యరాజము రామాయణము. ఇందులకుఁ గారణము లేకపోలేదు. రామాయణము మృదుమధుర భాషకు మూలకందము. ఔచిత్యమున కాటపట్టు. కావ్యధర్మములకుఁ గాణాచి. నిరుపమాన కవితా సంపదకు నిక్షేపము. నీతికి నిధి. ఐహికాముష్మిక విజ్ఞానమున కాలవాలము. సారళ్య సౌలభ్యములకు జన్మభూమి. విభక్తిజ్ఞాన మలవఱచుకొనిన విద్యార్థులకు సహితము సులభగ్రాహ్యము. పూజామందిరమున నీ పవిత్ర కృతి నలంకరింపని పుణ్యపురుషుఁడు భరతఖండాన నహి. ఆదరమున నీ యాదికావ్యము సన్నుతింపని యక్షరాస్యుఁడీ యవనీమండలమున నే సున్న.

జగదేకవంద్య మగు నిట్టి యుత్తమోత్తమ కృతిని సృష్టింపఁగలిగిన మహాకవి వాల్మీకి. మహాపురుషులయు మహానదులయు నుత్పత్తి స్థానము లనూహ్యములు. అగమ్యగోచరములు. అట్లే యీ యాద్యకవి యావిర్భావమును గూర్చియు నభిప్రాయ వైవిధ్యము కద్దు. 'వల్మీకస్యాపత్యం' వల్మీకముని కొడుకని కొందఱును 'వల్మీకాద్బహిరాగతః' వల్మీకమునుండి బయల్వెడలినవాఁ డని మఱికొందఱును జెప్పుదురు. ఇందు మొదటి తెగవారు స్కాంద పురాణమును,

ద్వితీయ శ్రేణివారు పద్మ పురాణమును దమకుఁ బ్రమాణము లుగ వ్రాక్రుత్తురు. ఒకానొకప్పుడు వల్మీకుఁ డను మహర్షి యనుగ్రహమున నొక యురగాంగనకు గర్భోత్పత్తియై కాల క్రమమున బుత్రోదయ మయ్యెను. ఆ పుత్రరత్నమే వల్మీకముని సంభవుఁడు గాన వాల్మీకి యయ్యెను — ఇది స్కాంద పురాణ గాథ. ఇఁకఁ బద్మపురాణ కథ వినుఁడు:—

ఒకానొక కిరాతుఁ డుండెను. అతఁడును మిగుల నైచ్యమునకుఁ బాల్పడి దారిదోపిడి మున్నగు ఘోర కృత్యము లొనర్చుచుండెను. ఒకనాఁడు సప్తర్షిసత్తము లరణ్యమునఁ బోవుచుండ నీ కిరాతుఁడు వారినే యెదుర్కొని కపాలమోక్ష మొనరింప నుద్యుక్తుఁ డయ్యెను. వారు దివ్య దృష్టి ప్రభావమున నాతని పూర్వవృత్త మెఱింగి యాతఁ డొక మహానుభావుఁ డగునని తలఁచి తమ యోగ విద్యా మహాత్మ్యమున నాతని మనసు మార్చిరి. తారక మంత్రో పదేశ మొనరించి జపించు మనిరి. కిరాతుఁడును మునీశ్వ రాదేశానుసారము నిరంతర రామనామస్మరణ మొకచోఁ జేయుచుఁ గూర్చుండెను. నిశ్చల ధ్యానతత్పరుఁ డగు నాతని చుట్టును జెదలు పుట్టలు పెట్టెను. కతిపయదినములకు మరల సప్తర్షు లాదారి నేగుచు 'కిరాతా!' యని సంబోధించిరి. తత్క్షణ మా కిరాతుఁడు పుట్ట ఛేదించుకొని బయల్వెడలెను. ఆతఁడే వల్మీక సంభవుఁడు గాన వాల్మీకి యయ్యెను.

ఇతనికి ఋక్షుఁడు, భార్గవుఁడు, ప్రాచేతసుఁడు నను మఱి మూఁడు పేర్లు గలవు. ఈతని కాలము శా. పూ. 13–వ శతాబ్ది యని చరిత్రకారులు నిర్ణయించిరి.

ఉత్తమ శ్లోకుఁ డగు నీ తపోనిధి యొకనాఁడు భరద్వాజుఁ డను శిష్యశిఖామణితోఁ గూడి తమసాతీర్థమునకు స్నానార్థ మరుగుచుండెను. మధ్యేమార్గమున నొక చెట్టుపై నొక క్రౌంచమిథునము గూర్చుండెను. ఈతఁడు చూచుచుండగనే యొక నిషాదుఁ డొక యమ్ము గుఱివెట్టి యందలి మగ పులుఁగును నేలఁ గూల్చెను. భూపతన మగు నా విహంగము గిజగిజ గుంజులాడుచుండ నాడుపక్షి మిగుల హృదయవిదారకముగ నార్చుచుండెను. ఈ దృశ్యము నాద్యంతము కన్నులారఁ గాంచిన వాల్మీకినోటినుండి యప్రయత్నముగ నీ క్రింది మాటలు శ్లోకరూపమున వెలువడెను.

"మా నిషాద ప్రతిష్ఠాంత్వ మగ మశ్శాశ్వతీస్సమాః,
యత్క్రౌంచ మిథునాదేక మవధీః కామమోహితమ్."

కొండొకవడికి వాల్మీకికి బ్రహ్మ ప్రత్యక్షమై యాదృచ్ఛికముగ నాతని నోట సరస్వతి వెలువడుటకుఁ దన సంకల్పమే కారణ మనియు, శ్రీరామ చరితము భూతలమున శాశ్వతముగ నుండునట్లు ఛందోబద్ధ మొనరింపు మనియు నానతిచ్చి యదృశ్యుఁ డయ్యెను. ఇట్లు విరించి యనుగ్రహమునకుఁ బాత్రుఁడై వాల్మీకిమహర్షి సీతారాముల దివ్యగాథను మిగుల లోకోత్తరమగు ఫణితిని విరచింపఁగల్గెను.

ఈ కావ్యరాజము మిగుల మృదుమధురమై పఠనయోగ్యముగ నుంటయేకాక యిందు సత్యసంధత, పితృభక్తి, పితృవాక్య పరిపాలనము, సౌభ్రాత్రము, పాతివ్రత్యము, తపశ్శక్తి మున్నగు విషయములు కుప్పతిప్పలుగఁ గలవు. ఈ కావ్యోత్పత్తికిఁ బిమ్మట భరతఖండమున నెన్నియో

రాజకీయ సాంఘిక మత విప్లవములు సంఘటిల్లినవి. కాని భారతీయులకు దీని ప్రామాణ్యమించుకయు సడలదయ్యెను. తరువాతి సంస్కృత మహాకవులకెల్ల నిది పెట్టినదియే కావ్యభిక్ష. సత్పాత్రద్వారమున నీ కావ్యము భారతీయులకు సత్ప్రవర్తన ముగ్గుఁబాలతో రంగరించి పెట్టినది. రామకథయం దెట్టి రామణీయకత కలదో కాని యది మన దేశమునఁ బెక్కు రూపములతో వెలసి విలసిల్లినది. కావ్యములు, నాటకములు, యక్షగానములు, శతకములు, హరికథలు, కీర్తనలు, పాటలు, పద్యములు మున్నగున వెన్నియో యీకథ నాశ్రయించినవి. ఒక్క రామాయణమే పెక్కు నామముల ధరించి, వాల్మీకి రామాయణము, వాసిష్ఠరామాయణము, అధ్యాత్మ రామాయణము మున్నగు రూపములఁ బ్రత్యక్ష మగుచున్నది.

రసపోషణమున నీ కావ్యము సంస్కృత కవులకెల్ల నాదిగురువు. ఇందు వీరరసము ప్రధానము. శృంగారాదులంగములుగఁ బోషింపఁ బడినవి. అడపదడప నద్భుతమును గరుణమును గూడఁ జక్కఁగఁ బోషింపఁ బడినవి. రసపోషణము, పాత్రౌచిత్యము, కథాసంవిధానములకే కాక భాషామార్దవమునకు గూడ వాల్మీకియే యెల్లర కవులకు నాద్య గురువు. 'నిరంకుశాః కవయః' యను నార్యోక్తి నీకవి భాషావిషయమునఁ గూడఁ బాటించి యున్నాఁడు. వ్యాకరణ విరుద్ధములగు ప్రయోగములు కావ్యమునందచట నచట నున్నను దరువాతి వైయాకరణులు వానిని శిష్ట ప్రయోగములుగ శిరసావహించి యున్నారు.

# 2. వ్యాసుఁడు

'వినిన భారతమే వినవలయు, తినిన గారెలే తినవలయు, కనినఁ గొడుకునే కనవలయు' నను లోకోక్తినిఁ బట్టియే భరతఖండమున భారతమునకుఁ గల ప్రశస్తి వెల్లడి యగుచున్నది. భారతసంహితా కర్త వ్యాస మహర్షి. వేదముల విభజించెను గాన వేదవ్యాసుఁడనియు, సత్యవతీ తనయుఁడు గాన సాత్యవతేయుఁ డనియు, బరాశరుని పుత్రుఁడు గాన పారాశరి యనియు, ద్వీపమునం దుద్భవించెను గాన ద్వైపాయనుఁ డనియు నీతనికి నామాంతరములు. వ్యాసమహర్షి యుత్పత్తినిఁ గూర్చియు నొక వింత కథ గలదు:—

పరాశర మహర్షి యొక దినమునఁ దీర్థయాత్రకై బయల్వెడలెను. మార్గమధ్యమున నాతఁడు యమునఁ దరింప వలసి దాశరాజను పల్లెనాయకునిఁ బిలిచెను. కూడు గుడుచుచున్న యాతఁడు తన చిన్ని కుమార్తె నా పనికై పంపెను. ఆమెయు మహర్షి నొక యుడుపం బెక్కించి నదిలో నడుపుచుండెను. అత్తరి నత్తపసి మదన వేదనాదోధూయమానమానసుండై యామె కరగ్రహణ మొనర్చెను. అక్కన్య సిగ్గుపడి 'మహాత్మా! నిషాద కన్య నగు నన్ను ముట్టుట మునిసత్తములగు తమబోంట్లకు భావ్యమా? అదియునుగాక మత్స్యగంధి నగు నాపైఁ దమకించు టసహ్యము గాదే?' యనెను. కాని యప్పలుకు లాతనిముందు బధిరశంఖారావము లయ్యెను. 'కామాతు

రాణాం న భయం న లజ్జా' యని కదా యార్యోక్తి. ఓడ యొద్దుఁ జేరిన పిమ్మట నమ్మహర్షి యాపెఁ జెట్టఁ బట్ట మరలఁ బట్టు బట్టెను. ఆపెయుఁ 'బట్టపగ లిట్టి సాహసమున కొడిఁ గట్టుదురే?' యన నాతఁడు తన తపఃప్రభావమున మంచుఁ గల్పించి చిమ్మచీఁకటు లలముకొనున ట్లొనరించెను. అక్కన్య తన కన్యాత్వమునకు భంగము వాటిల్లునని కొందల మందుచుండ నట్లెన్నటికిని జరుగకుండుగాత మని యాతఁ డనుగ్రహించెను. అంత నాతఁ డాపెను యోజనగంధివి గమ్మనియు సుపుత్రుఁ డుద్భవించు ననియు ననుగ్రహించి యిష్టోపభోగము లనుభవించి యంతర్హితుం డయ్యెను. యోజనగంధి యగు సత్యవతి సద్యోగర్భము దాల్చి వ్యాసునిఁ గనెను.

సత్యవతీపరాశర తనయుఁ డగు కృష్ణద్వైపాయనుఁడు తల్లి యాజ్ఞాప్రకారము ధృతరాష్ట్ర పాండు విదురు లను గుమారులఁ గాంచి వారు గతించిన యనంతరము భారతము జెప్పె నని సంప్రదాయజ్ఞుల యభిప్రాయము. చిక్కువడి యున్న వేదప్రపంచమును జతుర్వేదములుగ వేర్పఱచుటయే కాక యష్టాదశ పురాణములను భారతమును గూడ నాతఁడు రచించెను. భారత రచన మొనర్చుటతో నాగక దానిని సుమంత జైమిని వైశంపాయనాసిత దేవలముఖ్యులగు శిష్యులకును బుత్రుఁ డగు శుకునకు నుపదేశించెను.

భారతేతిహాసము భారతీయుల పాలిటి పెన్నిధి. ఇయ్యది ప్రబోధింపని ధర్మముగాని యిందుఁ గన్పట్టని నీతి గాని కాన్పింపదు. ధర్మముల భారమున నిద్ది వేదములకన్న

భారతరము గాన మహాభారత మనియు నన్ని వేదధర్మముల సార మిందు గలదు గానఁ బంచమవేద మనియు బ్రసిద్ధి. ఒక్క ధర్మము నొక్క నీతి యననేల? ఎవరి కేది కావలసిన దానిని బోధించుచు నియ్యది సమస్త జనరంజక మయ్యెను.

"ధర్మతత్త్వజ్ఞులు ధర్మశాస్త్రం బని
యధ్యాత్మ విదులు వేదాంత మనియు
నీతి విచక్షణుల్ నీతిశాస్త్రం బని
కవివృషభులు మహాకావ్య మనియు
లాక్షణికులు సర్వలక్షణం బనియును
నైతిహాసకు లితిహాస మనియు
బరమపౌరాణికుల్ బహుపురాణసముచ్చ
యం బని మహిమఁ గొనియాడుచుండ"

ఇద్ది ప్రాచీన భారతీయ విజ్ఞానమును నాగరకతను వ్యక్తీకరించు నుద్గ్రంథము. భారతీ యార్యుల భౌతిక మానసికాధ్యాత్మిక శక్తు లన్నియు నద్దమునందువలె నిందుఁ బ్రతిబింబించినవి.

ఈ యుద్గ్రంథము ప్రపంచమందలి నాగరికభాష లన్నిఁటి యందును భాషాంతరీకరింపఁబడి ప్రపంచఖ్యాతి నందికొన్నది. ఖండఖండాంతరములఁ గూడ జనామోదముఁ బడయఁ జాలినది. రామాయణమునుఁ బట్టి యుద్భవించిన కావ్యములకన్న భారతమును బట్టి జనించిన కావ్యములే ప్రపంచమున నెక్కుడుగఁ గలవు. ప్రపంచజ్ఞాన మలవఱచు కొనఁదలఁచిన ప్రతివాఁడును నీ గ్రంథముఁ దప్పక పఠించ వలెను. కావుననే యెన్ని విద్యలు చదివినను భారతముఁ జదువనివాఁడు నేర్పరియో కాఁడను వాడుక గలదు.

కావ్యకర్త లోకసంగ్రహణాభిలాషి యగు మహర్షి. ఇతివృత్త ముదాత్తము. విషయ మాధ్యాత్మిక ప్రధానము. ఇంక గ్రంథవైశిష్ట్యమునకు లోటేమి? కౌరవ పాండవ యుద్ధ మని పేరేకాని యిందు వర్ణితమైనది పుణ్యాపాపములకు సత్యాసత్యములకు న్యాయాన్యాయములకు జరిగిన యుద్ధము.

రామాయణ మహాభారతములు రెండును భగవతి సరస్వతికి రెండు కన్నులు. ఈ రెండు గ్రంథములును ధర్మ ప్రతిపాదకములే కాని రచనా పద్ధతి వేఱు. రామాయణము నందు రసోత్కర్ష ప్రాధాన్యము వహింప భారతమునం దర్థ గౌరవము ప్రాముఖ్యమైనది. రామాయణ మేకనాయకము. భారతము బహునాయకము. నాయిక రెంటియందు నయోనిజ. రెంటియందును యువతియే యుద్ధకారణము. అచట దుశ్శీలుఁడగు రాక్షసుఁడు శత్రువు. ఇచట దుష్ప్రవర్తకుఁడగు జ్ఞాతి విరోధి. అందు కామము ప్రధాన దుష్టగుణమైయుండ నిం దర్థము ప్రముఖ దుర్మార్గము. రామాయణమున యుద్ధమొనర్చినది కారణజన్ముఁడగు శ్రీరాముఁడు. భారతమున యుద్ధమొనర్చినది లీలామానుషవిగ్రహుఁడగు శ్రీకృష్ణుఁడు. రామాయణమునందువలె భారతమునందును పితృభక్తి ప్రతిజ్ఞా పరిపాలనము నుద్బోధించుటకై భీష్మపాత్ర సృష్టింపఁ బడినది. తదితర పాత్రలు గూడ తలకొక ధర్మ ముపదేశించినవి. ధర్మరాజు సత్యవాక్పరిపాలనమునకును, భీమార్జునులు బల శౌర్య సౌశీల్యములకును, న్యాయైక పక్షపాతమునకు ద్రోణుఁడును, పరాక్రమ దాతృత్వములకుఁ గర్ణుఁడును, రాజనీతిజ్ఞతకు శ్రీకృష్ణుఁడును ననితర సామాన్యము లగు

దృష్టాంతములు గదా ! దైవపౌరుషములకు హస్తిమశకాం తరము గలదనియుఁ దుదకు దైవమే ఫలించి పౌరుషము విఫలమగు ననియు నిందుఁ జక్కఁగ నిరూపింపఁ బడినది. రామాయణ భాషవలె భారతభాష యాపాత మృదుమధురము గాదు. భారతమునఁ గొన్ని పట్టులు క్లిష్టాన్వయ సమన్వితములై యుండును. ఇందును వీరరసమే ప్రధానము. ఈ గ్రంథమున నితర ధర్మములతోఁ బాటు సాంఘిక ధర్మములన్నియు ససాకల్యముగ వర్ణితములైనవి. మన మిప్పుడు కన్నులారఁ గాంచుచున్న సాంఘిక దురాచారములు కలియుగాంతమున గన్పట్టునని వచించి వ్యాసుఁడు తన దూరదృష్టినిఁ బ్రస్ఫుట మొనరించెను.

# 3. గుణాఢ్యుఁడు

అసాధారణ మహిమాఢ్యుఁ డగు గుణాఢ్యుఁడు ప్రాకృత భాషా కవియైనను బెక్కు సంస్కృత కావ్యకథలకు మూలమగు బృహత్కథను సృష్టించి సంస్కృత కవులకు గురుప్రాయుఁ డయ్యెఁ గాన నీతని చరితయు నవశ్య పఠనీయము. బృహత్కథ పెక్కు కావ్య కథలకు మూలమగుటయే కాక యనేక కథాకావ్యములకు మార్గదర్శకము. దండి, భట్ట, బాణుఁడు మున్నగు పెక్కురు సంస్కృత కవివరేణ్యు లీ బృహత్కథను మిగుల శ్లాఘించిరి.

భాసకవికృత స్వప్నవాసవదత్త రూపకమందలి యితివృత్త మీ బృహత్కథలోనిదే. క్షేమేంద్ర కవి దీనిని బృహత్కథామంజరి యను పేర సంస్కృతమున కనువదించెను. సోమదేవభట్టు కథాసరిత్సాగర మను పేర దీనిని సంస్కృతీకరించెను. బుధస్వామి యను మఱియొక కవి బృహత్కథాశ్లోక సంగ్రహ మను పేరట దీని ననువదించెను. కాన బృహత్కథ ప్రాచీన ప్రాశస్త్య ప్రాముఖ్యములు వర్ణనాతీతములు. ప్రపంచమున నీ కవిపేరుకంటె నీతని కావ్యము పేరే యెక్కుడు ప్రచారములో నున్నది. ఈ యుద్గ్రంథము పైశాచీ ప్రాకృత భాషయందు రచింపఁబడినది.

కాశ్మీర నేపాల దేశములందు గుణాఢ్యుని గుఱించియు నాతని బృహత్కథనుఁ గూర్చియు మహిమాన్వితములగు కథలు పెక్కులు ప్రచారమున నున్నవి. అందొక్క దాని నారయుఁడు :—

ఒక్కనాఁడుబుసుపోకకు శివుఁడు పార్వతికి విద్యాధర చక్రవర్తుల కథలను వినిపించు చుండెను. ఆ సమయమున వారి భక్తుఁ డగు పుష్పదంతుఁడు తుమ్మెద యాకారముఁ గైకొని యాచోటుఁ బ్రవేశించి యా కథలు వినెను. వినుటయే కాక యింటికేగి జయ యను తన యిల్లాలికి వినిపించెను. తదుపరి యొకనాఁ డివి క్రొత్త కథ లని యంబ తన చెలికత్తెలకు వినిపించుచు జయ కివి శ్రుత పూర్వములని తెలిసికొనెను. పుష్పదంతుఁడే యీ పని యొనర్చెనని సవిస్తరముగ గ్రహించి యాతనిఁ బిలిపించి మర్త్యుఁడవై జనింపు మని శపియించెను. ఆతని నొక్కనినే కాక యాతని ప్రాణమిత్రుఁడగు మాల్యవంతునిఁ గూడ నట్లే శపించెను.

జయ, దేవిపాదములపైఁ బడి క్షమాభిక్ష వేఁడ నామెయు నక్కటికము వహించి 'సుప్రతీకుఁడు కుబేర శాపోపహతుఁడై వింధ్యారణ్యమునఁ గాణభూతి యను పేరఁ జరించు చున్నాఁడు. నీ ప్రియుఁ డాతని కీ కథలు వినిపించి శాపవిముక్తుఁ డగును. ఆతని వలన వీనిని విని మాల్యవంతుఁడు శాపవిముక్తిఁ గాంచు' నని యనుగ్రహించెను.

మాల్యవంతుఁడే భూలోకమున గుణాఢ్యుఁడను పేరఁ బుట్టి సుప్రతిష్ఠను బాలించు శాతవాహనునకు సచివుఁ డయ్యెను. ఈ శాతవాహనుఁడే మన యాంధ్రవంశపు రాజులందు గొప్ప పేరు ప్రఖ్యాతులు గడించినవాఁడు. గుణాఢ్యుఁ డట్లే కొంత కాలమునకు వింధ్యారణ్యమునకు వచ్చి, పైశాచిక భాష నభ్యసించుచుఁ, గాణభూతి వలన నీ కథలను

వినెను. తత్క్షణ మాతఁ డానందవివశుఁడై తాను నేర్చిన పిశాచభాషలో నీ కథలను భూర్జర పత్రములపై స్వరక్తముతో లిఖియించి బృహత్కథ యను నామకరణ మొనర్చెను. దానిని ప్రచార మొనర్పవలె నను తలఁపున నొక యాటవికుని చేతి కిచ్చి శాతవాహనున కంపెను.

మదోన్మత్తుఁడగు శాతవాహనుఁడు రక్తాక్షర పంక్తుల నేవగించి, వాని నావల విసరివైచి, యాటవికునిఁ గసరి కొట్టెను. ఆటవికుఁ డా పత్రముల నేరి తెచ్చి యావద్వృత్తాంత మునుఁ గవికి వినిపించెను. కవియుఁ గొంతవడి విచారించి, యా పత్రము లొక్కొక్కదానిఁ జదువుచు నగ్నిహోత్రమున హోమ మొనర్చు చుండెను. శాతవాహనుఁ డీ సంగతి విని స్వయముగ బరువెత్తుకొని వచ్చి దగ్ధ మొనర్పవలదని కవినిఁ బ్రార్థించెను. అప్పటికే యాఱులక్షల గ్రంథము హుతమై యొక లక్ష గ్రంథము మాత్రము మిగిలెను. హుతశేష గ్రంథ మును రాజున కీయ నాతఁడు పరమానంద భరితుఁడై గృహోన్ముఖుఁ డయ్యెను. గుణాఢ్యుని పేరనున్న మాల్యవంతుఁడు శాపవిముక్తుఁడై స్వస్థానము చేరెను. ఈ కథలు వినిన మాత్రమునఁ బిశాచములకు దేవత్వ మబ్బెను.

# 4. భాసుఁడు

సంస్కృతదృశ్య కావ్యకర్తలందు భాసుఁ డప్రతిమాన ప్రతిభాదురంధురుఁడు. భాసనాటకములకుఁ గల ప్రసిద్ధి యీ క్రింది శ్లోకమే చెప్పక చెప్పుచున్నది :—

" భాషాసురమ్యా గైర్వాణీ తస్యాం కావ్యం మనోహరమ్
తత్రాపి రూపకం రమ్యం తత్ర భాసకవే కృతిః"

దురదృష్టవశాత్తు భారతీయులకు చారిత్రక రచనయం దభిలాష మృగ్యము. కావుననే భాసుఁడు కేరళ ప్రాంతీయుఁ డని కొందఱును నుజ్జయినీ వాసి యని మఱికొందఱును జెప్పుచున్నారు. ఇమ్మహాకవి యిరువదినాలుగు రూపకములు రచించె నను ప్రసిద్ధి కలదు. కాని యందు పదుమూఁడు మాత్రమే మనకు లభ్యములు. ఇందునుఁ గొన్ని యీతనివి కావని కొందఱు విమర్శకుల యభిప్రాయము. ఆ పదుమూఁడు రూపకముల పేర్లివి :—

స్వప్నవాసవదత్త, ప్రతిజ్ఞా యౌగంధరాయణము, ప్రతిమ, అభిషేకము, చారుదత్తము, అవిమారకము, బాలచరితము, మధ్యమవ్యాయోగము, పంచరాత్రము, దూతవాక్యము, దూతఘటోత్కచము, కర్ణభారము, ఊరుభంగము. ఇందు మొదటి రెంటికిని మూలము బృహత్కథ. తరువాతి రెంటికిని మాతృక రామాయణము. చారుదత్తము, అవిమారకము కల్పితములు. బాలచరితము హరివంశము నాశ్రయించినది. మిగిలిన యాఱింటికిని భారత మాధారము. దృశ్యకావ్యకర్త, ప్రఖ్యాతేతివృత్తము నైన నౌచిత్యభంగము

గాకుండ, పాఠక జనరంజకముగ మార్పు జేయవచ్చు ననుట కీ కవియే మార్గదర్శకుఁడు. భారత రామాయణ కథల నాశ్రయించిన యీతని రూపకములే యిందులకుఁ బ్రబల తార్కాణములు. స్వకపోల కల్పితమగు నవిమారకము రూపకములం దగ్రగణ్యము. చారుదత్తము మృచ్ఛకటికము నకు మూలాధారము.

ప్రకృతి సౌందర్య వర్ణనమునందును, మానవ స్వభావ పరిణామమునఁ దీర్చి దిద్దుట యందును నీకవి యందె వేసిన చేయి. ఈ విషయమున భవభూతి కాళిదాసాదులకుఁ గూడ నీతఁడే యాద్య గురువు. స్వప్నవాసవదత్త నాటక వాఙ్మయమునం దనన్య సామాన్యము. ఇందలి కథా సంవిధాన మనితర సాధ్యము. సర్వభక్షకుఁడగు నగ్ని హోత్రుఁడు గూడ దీనినిఁ జెనకఁజాలఁ డయ్యెనని రాజ శేఖరుఁడు 'స్వప్నవాసవదత్తస్య దాహకోఽభూన్న పావకః' యని కథాసందర్భమునుఁ బట్టి చమత్కరించినాఁడు. రస గుంఫనమునందేమి, పాత్రౌచిత్యమునందేమి, కథాకల్పనము నందేమి, రూపకలోకమున స్వప్నవాసవదత్తదే యగ్ర తాంబూలము.

ఈకవి సర్వతంత్ర స్వతంత్రుఁడు. నిరంకుశుఁడు. 'నిరంకుశాః కవయః' యను నార్యోక్తి నీతఁడు పాటించిన ట్లేకవియుఁ బాటించలేదు. వైయాకరణులనుఁ గాని లాక్షణి కులఁగాని లక్ష్యపెట్టువాఁడు గాఁడు. నాటకలక్షణ విరుద్ధ ముగ మల్లయుద్ధము మరణము మున్నగు వానిని రంగ స్థలమునఁ బ్రదర్శించుటయే యిందులకు నిదర్శనము.

నాంద్యంతమున సూత్రధార ప్రవేశము, స్థాపనల సంగ్రహీకరణము, నంకముల హ్రస్వీకరణము నీతని నాటకము లందలి నవ్యతలు. పాత్రల సంభాషణల ద్వారమున కథ రంగస్థలమున నిరాఘాటముగ బేరెమువాఱుచుండును. అద్భుత రూపక నిర్మాణ కౌశలమువలన నీతనిని రూపక పితామహుఁ డనినను నతిశయోక్తి కానేరదు. సర్వతోముఖ వైదుష్యముగల నీకవి వేదవేదాంగ విదుఁడే కాక తార్కిక చక్రవర్తి. సర్వశాస్త్ర పారంగతుఁడు. కాళిదాసాది మహాకవులకువలె నీ కవికినిఁ గొన్ని కట్టుకథ లంటఁగట్టఁబడినవి. అం దొకటి రెం డుదాహరణలు :—

శ్రీహర్ష నిర్మితము లని ప్రపంచమునఁ బ్రతీతిఁగాంచిన రత్నావళీ ప్రియదర్శికా నాగానందము లతనివి కావనియు, భాసుఁడే ధావకుఁ డను నామాంతరమున వానిని రచించి శ్రీహర్షుని పేరు పెట్టె ననియు నీ క్రింది కథ ప్రచారమున గలదు.

ఒకానొకనాఁడు శ్రీహర్షుఁడు మృగయావినోదార్థ మటవి కేగి గృహోన్ముఖుఁ డగుచుండెను. మార్గమధ్యమున నొక మడివేలు బట్ట లుదికి యారవైచి తత్పార్శ్వమునఁ గూరుచుండి యాకు గంటము పెట్టి వ్రాయుచుండెను. ఆశ్చర్యచకితమానసుఁ డగు రాజాతని 'నేమి వ్రాయుచుంటివి?' వని ప్రశ్నించెను. ఆతఁడు నాగానందము రచించుచుంటి నని ప్రత్యుత్తరించెను. రా జబ్బుర మినుమడింప రెండు శ్లోకములఁ జదివించి విని యానందించి యాతని నింటికిఁ గొంపోయి మిగుల గౌరవించెను. 'నీచే నింతవఱకు నిర్మింపఁ

బడిన కావ్యములు నా పేరఁ బ్రకటింపు మని వేఁడుకొనెను. ఆ రేవఁడును జేఁడునకు మాటాడలేక రూపకారంభాదులఁ దదనుగుణ్యముగ మార్చి యీ మూఁడు నాటకము లాతని పేరనే ప్రకటించెను.

ధావక నామాంతరముఁగల యీ భాసుఁడే యమక కావ్య మొకటి రచించెను. రచించుట మాత్రమే కాక యమక కవిత్వముసఁ దన్నోడించినవారి యింటికిఁ గుండ పెంకుతో నీళ్ళు మోయుదు నని శపథ మొనర్చెను. ఇది విన్న కవు లసూయాప్రేరిత మానసులై యాతనికి ఘటకర్ప రుఁడని పేరుపెట్టిరి. ఈ ధావకభాసుఁడే తా నిరువదినాలుగు రూపకముల రచించితి నని తన యుదాత్తరాఘవ మను గ్రంథప్రస్తావనలోఁ జెప్పుకొని యుండెను. ఇట్టి కట్టుకథ లన్నియుఁ 'గథకుఁ గాళ్ళులేవు, ముంతకుఁ జెవులు లే' వను నట్టు లంధపరంపరాన్యాయమునం దిముడఁ దగినవి.

# 5. కాళిదాసు

'కనిష్ఠికాధిష్ఠిత కాళిదాసః' 'ఉపమా కాళిదాసస్య' ఇత్యాది యార్యోక్తులు వినియుందురు. మనదేశమునఁ బుట్టి సర్వదేశాంతర్యాములగు కవులలోఁ గాళిదా సగ్ర గణ్యుఁడు. పాశ్చాత్య కవి యగు షేక్స్పియరున కెట్టి ప్రపంచఖ్యాతి కలదో ప్రాచ్య కవిచక్రవర్తి యగు కాళి దాసున కట్టి జగత్ప్రసిద్ధి గలదు. ఈ మహాకవి కాల నివాసాదులను గూర్చి పెక్కురు ప్రాచ్య పాశ్చాత్య విద్వాం సులు పరిశోధనల నొనర్చిరి. కాని యిదమిత్థమని యొక్క రును దేల్పఁజాలరైరి. దీనికిఁ గారణ మా పేరుగల కవు లైదారుగు రుంటయే. కొందఱు విమర్శకు లిది బిరుద నామమే కాని యసలు నామము కాదనికూడ వక్కాణిం చిరి. పరమేశ్వర తత్వమువలెనే యీ కవీశ్వర తత్వము గూడ నగమ్యగోచర మగుట కతన నీతని గూర్చి భిన్న విమర్శకులు భిన్నాభిప్రాయము లొసంగి యుండిరి.

కాళిదా సాఱవ శతాబ్దమువాఁ డని కొందఱును, మఱికొంద ఱేడవ శతాబ్దివాఁడనియు, నింక కొంద ఱెనిమిదవ శతాబ్దమువాఁ డనియు నిట్లీతని కాలము పండ్రెండవ శతా బ్దము దాక సాగఁదీసి వదలిరి. కొందఱు విమర్శకు లితఁడు వంగదేశస్థుఁ డని నిశ్చయించిరి. మఱికొందఱు కాశ్మీరవాసి యని నిర్ధారణఁ జేసిరి. ఇంకనుఁ గొందఱు గుజరాతీయుఁ డని సిద్ధాంతీకరించిరి. ఇట్లు పాప మా కవిపుంగవుని రాష్ట్రి రాష్ట్రిమును ద్రిప్పిరి. పరిశోధకులు కొంద ఱీతఁడు శైవుఁ

డని వక్కాణించిరి. మఱికొందఱు ద్వైతి యని నిరూపించిరి. దీని కంతకును మూలకారణ మేమనఁ గాళిదాసు స్వవిషయమును గాని స్వదేశ విషయమును గాని తన గ్రంథములం దెచ్చటను సూచింపక యుండుటయే కారణము. ఆంధ్ర కవివతంసు లగు శ్రీనాథ రామకృష్ణాదులకు వలె సంస్కృత కవిపుంగవుఁడగు కాళిదాసునకును బెక్కు పుక్కిటి పురాణములు కాకమ్మ కథ లంటఁగట్టఁబడినవి. అందీ కవి కవితోత్పత్తి కథ నారయుఁడు :—

పూర్వ మొకానొక రాజు గలఁడు. ఆతనికి నిబిడ నితంబ యను కుమార్తె యొండు గలదు. ఆతని యాస్థానమునఁ బెక్కురు పండిత ప్రకాండు లుండిరి. నిబిడనితంబ సకలవిద్యాపారంగతయు నభ్యస్త సమస్త శాస్త్రయు నై యుండెను. ఆ విదుషీమణి యపుడపుడు పండితమాన్యుల శాస్త్రవాదమున నోడించి యవమాన్యులఁ గావించు చుండెడిది. అది కారణముగ వారసూయాగ్రస్తమానసులై యాపెపైఁ బగదీర్చుకొను సమయముకొఱకు నిరీక్షించు చుండిరి. ఇట్లుండ నొకనాఁడు రాజు తన కుమార్తె కుచిత వరాన్వేషణ మొనర్పుఁడని పండితుల కాజ్ఞ యొసఁగెను. నిబిడనితంబకు గర్వనిర్వాపణ మొనర్ప నిదియ యదనని యెంచివా రమందానందకందళితహృదయులైరి. వెదకి వెదకి విద్యావిహీనుఁ డగు నొక పరమమూర్ఖునిఁ బట్టి తెచ్చిరి. రాజకుమార వేషమున నాతని రాజుసన్నిధికిఁ దీసికొనివచ్చి 'యీతఁ డుత్తమవంశ సంజాతుఁ డనియుఁ బండితాగ్రేసరుఁ డనియు జెప్పి యొప్పించి యాపె నిచ్చి వివాహ మొనరింపఁ

జేసిరి. ఉష్ట్రశబ్దము గూడ స్వచ్ఛముగ నుచ్చరింపలేని యచ్చవట నంటఁగట్టినందులకుఁ దమలోఁ దామిట్లు లానందించిరి.

"ఉష్ట్రేలుంపతి రంవా షంవా తస్మైదత్తా నిబిడనితంబా
కిం నకరోతి స ఏవహిరుష్టః కిం నకరోతి స ఏవహితుష్టః"

వివాహము నాటి రాత్రి వరుఁడు పడకగదిఁ బ్రవేశించెను. సూక్ష్మబుద్ధియగు నా రాకుమారి 'విగ్రహాఃపుష్టి నైవేద్యం నష్టి' యనునట్టు లాతఁ డక్షరజ్ఞానశూన్యుఁ డని మాటల సందర్భమున గ్రహించెను. పండితశ్రేష్ఠులు తన యెడ గావించిన యవమానమునకుఁ గినిసియుఁ గుందియుఁ దండ్రితోఁ జెప్పక 'దొంగకుఁ దేలుగుట్టిన' ట్లూరకుండెను. భర్తతో మాత్రము 'కాళి నారాధించి విద్య నార్జించి రమ్మ'ని చెప్పి కాళికాలయమున కంపెను. తత్క్షణ మాతఁ డట్లే యొనరించి యకుంఠిత దీక్షమెయి కాళి నారాధింప నాదేవి సంతుష్టయై యాతనికి సకల విద్యలును సత్కవిత్వము నబ్బునట్లనుగ్రహించెను. అనుగ్రహించుటయే తడవుగ నాతఁ డచటనే కాళికాస్తవ మొనరించి నాటనుండి కాళిదాసనఁ బరఁగెను. ఇంటి కేతెంచి జరిగిన యావద్వృత్తాంతము గృహిణి కెఱిఁగించెను. 'అస్తికశ్చి ద్వాగ్విశేషః' యను వాక్యముచేఁ గాళీ వరప్రసాదమునఁ దనకు వాక్చాతుర్య మబ్బె నని వాక్రుచ్చెను. తన భర్త స్వచ్ఛమగు సంస్కృత వాక్యము నుచ్చరించుటకు సంతసించియు రాకుమారి వెంటనే యాతని నంగీకరింప దయ్యెను. ఇంకను నాతని వైదుష్యముఁ బరీక్షింపఁగోరి 'నిరుపమానమగు నీ విద్యాజ్ఞానమును లోక

మునకు వెల్లడించుదనుక నిన్నంగీకరింప' నని నిర్బంధమైన మాట మిగఁ బల్కెను. అతఁడును వల్లె యని తన ప్రాసాదోపరి భాగమున నొంటరిగఁ గూర్చుండి తాను ప్రథమమున నుచ్చరించిన వాక్యమందలి యొక్కొక్క పదముతో నొక్కొక్క గ్రంథ మారంభించి తన కవితా చాతుర్యమును బ్రపంచమునకుఁ జాటెను.

'అస్త్యుత్తరస్యాందిశి దేవతాత్మా' యని 'యస్తి'తోఁ గుమారసంభవము 'కశ్చిత్కాంతా విరహ గురుణా' యని కశ్చిచ్ఛబ్దముతో మేఘసందేశమును, 'వాగర్థావివసంపృక్తౌ' యని వాక్ఛబ్దముతో రఘువంశ కావ్యమును 'విశేష సూర్యః స్పృహణీయ చంద్రమాః' యని 'విశేష' పదముతో ఋతుసంహార కావ్యము నారంభించి పూర్తి యొనర్చెను.

ఈ మహాకవి కుమారసంభవము, మేఘసందేశము, రఘువంశము నను కావ్యత్రయమును; మాలవికాగ్నిమిత్రము, విక్రమోర్వశీయము, శాకుంతలము నను రూపక త్రయమును రచించి రూఢికెక్కెను. ఇవి కాక యితని పేరఁ బెక్కు కృతులు కనబడుచున్నవి. కాని వాని కర్తృత్వ విషయము వివాదాస్పదము. శృంగారరస మీతని కభిమాన రసము. కుమారసంభవమునఁ బార్వతీ పరమేశ్వర సమాగమ ఘట్టమున నీ శృంగారము శ్రుతిమించి రాగమునఁ బడిన దని కొందఱు విమర్శకుల యభిప్రాయము. విప్రలంభశృంగారమునకు మేఘసందేశము పరాకాష్ఠ గదా!

కావ్యరత్నమాల యందు మేఘసందేశము నాయక రత్నము. కాళిదాసు ప్రతిభయు నుపజ్ఞయు నిం దుట్టిపడు చున్నవి. మల్లినాధసూరి 'మేఘే మాఘే గతం వయః' యని వ్రాక్రుచ్చెనట. స్వకపోల కల్పితమగు నీకృతి ననుసరించి పెక్కు సందేశము లుద్భవిల్లినవి కాని యెద్దియు దీని మించలేదు సరికదా సరితూగనైన లేదు.

ఇఁక ఖండాంతర ఖ్యాతి గడించినది శాకుంతల నాటకము. పాశ్చాత్య పండితులకు సహితము నాహా పుట్టింపఁజాలినది. గైటీ యను జర్మనీదేశపు విద్వాంసుఁడీ నాటకము విలోకించి మేరమెఱుఁగని సంతసమున దిగంబరుఁడై నాట్యమాడ నారంభించెనట. అందువల్లనే 'కావ్యేషు నాటకం రమ్యం, నాటకేషు శకుంతలా' యనినారు పెద్దలు. సహజ సౌందర్య వర్ణన మనిన నీకవికి నల్లేరుపై బండినడక. ఇతఁడు సర్వతంత్ర స్వతంత్రుఁ డగు కవియే కాక సర్వశాస్త్ర పారంగతుఁ డగు పండితుఁడు.

# 6. భర్తృహరి

భర్తృహరి మహాకవి. మహా పండితుఁడు. గొప్ప వైయాకరణి. ప్రపంచజ్ఞానమం దారితేరిన వాఁడు. బ్రహ్మ జ్ఞానమం దసమానుఁడు. లోకమునందు వాడుకలో నున్న భర్తృహరి వృత్తాంత మిద్ది.

పూర్వము చంద్రగుప్తుఁ డను నొక బ్రాహ్మణుఁడు గలఁడు. అతనికి నల్వురు భార్యలు గలరు. నల్వురును వరుసగ నాలుగు జాతులకుఁ జెందినవారు. బ్రాహ్మణ భార్య యందు వరరుచి యుద్భవించెను. క్షత్రియ స్త్రీయందు విక్రమార్కుఁడు జన్మించెను. వైశ్య సతియందు భట్టి యావిర్భ వించెను. శూద్రాంగన యందు భర్తృహరి యుదయించెను. భిన్నోదరులగు నీ నల్వురి యందును భర్తృహరి కనిష్ఠుఁడు. ఇతఁడు వల్లభిరాజ్య పరిపాలకుఁ డగు భట్టారకుని యాస్థాన కవి. ఇతఁ డొకానొక రాజ్యమునకు రాజుగ నుండి పరిపాలించుచున్న సమయమున నొక బ్రాహ్మణుఁ డీతని దర్శనార్థము వచ్చెను. అతఁడు రాజుకడ కేగుచు రిక్తహస్తములతోఁ బో నిచ్చగింపక నొక ఫలము దెచ్చి యుపాయ నముగ నిచ్చెను. ఆతఁ డా పండు నింటికిఁ గొంపోయి తన యర్ధాంగికి బహూకృతి నొసఁగెను. ఆమెయు నద్దానినిఁ దీసికొనిపోయి తన ప్రియున కిచ్చెను. ప్రియుని చేతియందున్న ఫలము భర్తృహరికంటఁ బడెను. తత్క్షణ మాతఁడు విరక్తిఁ జెంది సంసారపరిత్యాగ మొనర్చి యరణ్యమున కేగెను. ఇద్దికూడ నితరకవుల కంటఁగట్టఁబడిన కట్టుకథ వంటిదే కాని విశ్వసనీయము కాదని బహుజనాభిప్రాయము.

ఈ మహాపండితుఁడు పాతంజల భాష్యమునకు మహా భాష్య త్రిపది, మహాభాష్య దీపిక యను రెండు వ్యాఖ్యలు నిర్మించెను. లోకప్రఖ్యాతిఁ గాంచిన సుభాషితత్రిశతి రచించి తన యసమాన కవితా చాతుర్యమునుఁ బ్రకటించెను. భట్టి కావ్యము, పురుషార్థదశకము నను మఱిరెండుగ్రంథములుకూడ రచించెను. ఇతనికి హరి, భర్తృ యనెడి రెండు పేర్లు కలవనియు, భర్తృశబ్ద ప్రాకృత రూపమే భట్టి యనియు, భట్టి కావ్యరచయిత యితఁడే ననియుఁ బ్రతీతి కలదు. భట్టి కావ్యము రచించిన దీతఁడు కాదనెడి వాదముకూడ గలదు. ఈ మహామహుఁడు తన వాక్యపదీయమునకు లక్ష్యముగ భట్టికావ్యము రచించె నని పెక్కుఱ మతము. ఈ భట్టికావ్య మిరువదిరెండు సర్గలుగల మహా కావ్యము. ఇందుఁ బ్రకీర్ణము, ప్రసన్నము, తిజంతము, నధికారము నను నాలుగు కాండములు గలవు. ఇం దలంకార కావ్య వర్ణనాది కావ్యగుణములు చర్చింపఁ బడినవి. కావ్య లక్షణముల కిది యుత్తమ మార్గదర్శకము.

తరువాతఁ బుట్టిన వందలాది నీతికావ్యముల కీతని సుభాషితత్రిశతి యాద్యము. నీతి జ్ఞాన వైరాగ్యము లనెడి యీ త్రిశతి నిరుపమాన మృదుమధుర మగు శైలి నొప్పారుచున్నది. ఇందలి వైరాగ్య వర్ణనము జూచి భర్తృహరి తొలుత రాజై రాజ్యమును వదలి విరాగియైన పిమ్మట నీ గ్రంథము రచించి యుండునని కొంద అభిప్రాయ పడిరి. మఱికొంద ఱీతఁడు వలభీరాజుల యాస్థానమందుండి వారి యధికారాంతమున నీ గ్రంథము రచించె నని చెప్పు

దురు. కవినామమే గ్రంథనామముగఁ బ్రసిద్ధిఁ జెందిన నీ యుద్గ్రంథ మనేక భాషలలోనికి భాషాంతరీకరింపఁబడి జగద్వ్యాప్తిఁ గాంచినది. కాలక్రమమున నీ మహాగ్రంథమునం దితరుల శ్లోకములు కొన్ని ప్రక్షిప్తము లైనవి. ఇందలి శ్లోకములు కొన్ని యితరుల గ్రంథముల లోనికిఁ బ్రవేశించినవి.

ఈ మహాకవి సమస్త శాస్త్ర నిష్ణాతుఁడు. అద్వైత మతానుయాయి. జ్ఞానవేత్త. ఈతని భట్టి కావ్యమున కాలంకారిక ప్రపంచమున నంత ప్రసిద్ధి రాలేదు. కాని, వాక్యపదీయమునకు వ్యాకరణ ప్రపంచమునందును త్రిశతికి నీతికావ్య ప్రపంచమందును నసమానఖ్యాతి చేకూరినది. అయినను భట్టి కావ్యమునందుఁ గవి ప్రదర్శించిన కవితా చమత్కృతి నిరుపమానము.

ఇతర సంస్కృత మహాకవుల కాలములవలె నీ కవి వరేణ్యుని కాలమును సందిగ్ధమే కాని యిదమిత్థమని నిరూపించినవారు లేరు. ఇందులకుఁ బ్రధాన కారణము చరిత్ర రచనయందు మన దేశజులకుఁ గల యనాదర భావమే. ఎట్లైనను మాఘునికంటె భారవి పూర్వికుఁ డనియు నతనికంటె నితఁడు పూర్వుఁ డనియు బహు పండితాభిప్రాయము. ఇతనిది బౌద్ధమత మని కూడ కొందఱ మతము.

# 7. భారవి

పంచ కావ్యములందు ప్రౌఢతమ మని ప్రసిద్ధిగాంచిన కిరాతార్జునీయ కావ్యకర్త భారవి. ఈతఁడు శా. శ. 450 ప్రాంతమువాఁ డని కొందఱి విమర్శకుల యభిప్రాయము. ఈతఁడు భారతములోని పాండవుల యరణ్యావాస కథను గ్రహించి పాశుపతాస్త్రము కొఱకుఁ బశుపతినిఁ గూర్చి పార్థుఁడు తప మొనరించుట, కిరాత వేషధారియగు నీశ్వరుఁ డాతనితో యుద్ధ మొనర్చుట, పాశుపత ప్రదానము మున్నగు విషయములఁ గ్రోడీకరించి ప్రబంధ శైలిని, నారికేళ పాకమున నీ కావ్యరాజము రచించెను. ఇయ్యది పదునెనిమిది సర్గలు గల మహాకావ్యము. ఇందు ప్రథమ సర్గత్రయమునుఁ బాషాణత్రయ మందురు. 'భారవే రర్థగౌరవ'మ్మను నార్యోక్తినిఁ బట్టియే యిందలి యర్థ గౌరవ ప్రాధాన్యమును గ్రహింపవచ్చును.

భారవి వ్యాకరణశాస్త్ర నిపుణుఁడే కాక రాజనీతి శాస్త్ర నిష్ణాతుఁడు. చిత్రయమకబంధాది కవిత్వములన్న నీతనికిఁ బ్రీతి మెండు. ప్రతి సర్గయందును తుది శ్లోకమున లక్ష్మీవాచక పదము నియమముగఁ గలదు. కాన నీ కావ్యమును లక్ష్మీపద లాంఛనమనికూడఁ బిలుతురు. దీనినిఁ బట్టి యీతఁడు లక్ష్మీపదభక్తుఁ డనియు, నీతని యిష్టదైవమగు లక్ష్మీ కొల్లాపుర శ్రీమహాలక్ష్మి యనియు నది కారణముగ నీతఁడు తెలుఁగు దేశజుఁ డనియుఁ గొందఱ మతము. వాతోద్ధూతమై యాకసమున దట్టముగఁ గ్రమ్మిన భూపరాగ

మును ఛత్రముతోఁ బోల్చి యచటను 'కనకమయాతపత్ర లక్ష్మీం' అని శోభాపరముగ లక్ష్మీపద ప్రయోగ మొనర్చెను. అందువలన నీతనికి ఛత్రభారవి యను పేరు కూడఁ గలదట.

కిరాతార్జునీయ కావ్యమున వీరరసము ప్రధానమైనను శృంగారాది రసము లంగములుగఁ బోషింపఁబడినవి. ఇం దర్థాలంకారముల కంటె యమకాది శబ్దాలంకారములు మెండు. భావరసముల రెంటిని జోడించి జోడుగుఱ్ఱముల కదను ద్రొక్కించుటయం దీకవి దిట్ట. అలఁతియలఁతి పలుకులలో గొప్ప యర్థము నిముడ్చఁగల శక్తి యీకవి కున్నట్టు మఱి యే కవికిని లేదనవచ్చును.

భారవి మొదటిపేరు దామోదరుఁ డనియు, నారాయణస్వామి కొడు కనియు, గౌశిక గోత్రుఁ డనియు, నితని పూర్వనివాస మానందపుర మనియు, సింహవిష్ణుఁ డను రాజు నాహ్వానమున గాంచీపురమున కరుదెంచె ననియు నవంతిసుందరీకథ యను గ్రంథమున నున్నది. కాని యీ కథ విశ్వాసపాత్రము గాదు. భారవి కవిని గుఱించి తెలుఁగు నాఁటనే కాక యుత్తరహిందూస్థానమునఁ గూడ నీ క్రింది కథ ప్రచారమున నున్నది :—

భారవి చిఱుతప్రాయముననే పాణినీయ వ్యాకరణ శాస్త్ర నిష్ణాతమై, సాహిత్య విశారదుఁడై, సత్కవిత్వ మల్లఁ జాలి యుండెను. దీని నెఱింగిన పండిత ప్రకాండు లాతని తండ్రికడ కేగి 'మీ తనయుఁడు గొప్ప పండిత కవి యగు సూచన లగుపట్టుచున్నవి సుమా!' యని పొగడ సాగిరి.

తండ్రియు 'అంత ప్రశంసార్హమగు పాండిత్య మతనికడ నేమున్నది ? ఏదో చిన్నవాఁడు లెండి' యనుచుండెడి వాఁడు. ఇది వినుచున్న భారవి తన యభివృద్ధి తండ్రి కేవగింపుగ నుండె ననియు, నాతఁడు చనిన వెనుకగాని తన పాండిత్య ప్రకర్ష బయల్పడ వీలు లేదనియు నెంచి తండ్రి మాటలు తల్లికి వినిపించెను.

అంతటితో నాగక తండ్రి భోజనముచేయు సమయమున నాతని యాదల బ్రద్దలు గొట్టవలె నని యొక తిరుఁగటి కంటి నటకపై కెక్కించి సమయము కొఱకు నిరీక్షించుచు నటఁ గూర్చుండెను. అంత తండ్రికి భోజనము వడ్డించుచున్న తల్లి 'ఏమండీ! అబ్బాయి పాండిత్యమునకు మీ రసహ్యపడుచున్నారట ! వాని కది కష్టముగాఁ దోచుచున్న' దనెను. తండ్రియు 'పిచ్చిదానా ! కొమరుని విద్యపెంపు జనకుఁడు పొగడికొనుట యాతనికి శ్రేయము కాదు. అందువలన న ట్లనుచుంటినిగాని వాఁడు పండితుఁ డగుట నాకుమాత్ర మాహ్లాదజనకము గాదా!' యనెను. ఇది యంతయు వినుచున్న భారవి తండ్రియెడ నిష్కారణముగ నపచారమొనర్ప నెంచినందులకు పశ్చాత్తప్త హృదయుఁడై దిగివచ్చి 'తండ్రీ! మాననీయుల నిర్నిమిత్తముగఁ జెనకఁదలఁచిన మానవుల కేది శిక్ష ?' యని యడిగెను. తండ్రి 'యట్టివా రాఱునెల లత్తవారింటికడ నున్నఁ జాలు'నని నుడివెను. తండ్రి తన దురాలోచన మెఱింగియే యట్టి స్వల్పశిక్ష విధించె నని తలఁచి భారవి యాతని పాదములపైఁ బడి యట్టి

పాపిని తానే యని క్షమాభిక్ష వేఁడికొనెను. వెంటనే యత్తవారింటికిఁ బయనమై పోయెను.

అనాహూతుఁడై వచ్చినను నల్లుని నత్తవారు మొదట గౌరవించిరి. నాలుగైదు దినములు గడచినవి. కాని యీ దశమగ్రహము వదలు సూచనలు గన్పట్టవయ్యెను. నిరాదరణ ప్రారంభ మయ్యెను. వారు విసిగికొనసాగిరి. భారవి కంతయు నవగత మయ్యెను. కాని శిక్షాకాలము పూర్తి యగువఱకుఁ గదల వీలులేదు.

"శ్వశురగృహ నివాస స్వర్గతుల్యోనరాణాం
యది వసతి దినానిత్రీణి పంచాథసప్త,
దధిమధు ఘృతభక్ష్య క్షీరసార ప్రవాహః
తదుపరి నివసేచ్చేదన్నసార ప్రవాహః"

అని పెద్ద లూరక వచించిరా! పాపము! భారవి యత్తవారి యమర్యాదను వగచుచు నట్లే కాలము గడపుచుండెను. మామగారును బావమఱదులును 'తేరతిండి తిని తిన్నట్లు కూరుచుండిన నెట్లరుగు' ననియు, 'నేదైన నొక యతు కతుకరాదా' యనియు నీసడించి కసరసాగిరి. భారవి యన్నియు నోర్చుకొనుచు నట్లే పడియుండెను. తుదకు వారతనిని జొన్నచేను కాఁపునకు నియోగించిరి. భారవి యీ శిక్షకన్న మరణశిక్షయే మంచిదని యెంచుచు వడిశెల చేతఁ బట్టి మంచె యెక్కెను. భార్యకుఁ గూడ నిది యంతయు దుస్సహముగఁ దోచెనేకాని యేమి చేయఁగలదు? భారవి మంచెపైఁ గూరుచుండి పిట్టలఁ దోలుచునే కిరాతార్జునీయ కావ్యరచనకుఁ గడంగెను. అనుదినము భార్య తెచ్చి

పెట్టుచున్న యన్నము గుడుచుచు బ్రొద్దులు బుచ్చుచు నక్లే పడియుండెను. ఒక దిన మన్నము దెచ్చిన భార్య లజ్జావనతవదనయై నిలఁబడి 'నాథా! రేపు మా వదినె లేదో యొక వ్రత మాచరింతురట. నేనును వ్రత మొనర్ప వలె నని యున్నది. కాని మా యమ్మ మిమ్మడిగి డబ్బు తెచ్చుకొమ్మనిన'దని కంట నీరు వెట్టుకొనుచు గద్గద స్వర మునఁ బలికెను. అఱచేత గ్రుడ్డిగవ్వయైన లేని యాతఁడు తన దీనావస్థకుఁ గొంత పరితపించి ధైర్యము విడనాడక ప్రకృత చరితకునుఁ, గథాసందర్భమునకును సరిపడునట్లు కూర్చిన యొక శ్లోక మాకుపై లిఖించి 'యీ శ్లోకమును దీసికొనిపోయి యేకడనైనఁ బోకడవెట్టి నీకుఁ గావలసిన సంభారముల దెచ్చికొమ్మని' పంపెను. ఆ శ్లోక మిది:—

"సహసా విదధీత న క్రియా మవివేకః పరమాపదాం పదమ్
వృణతే హి విమృశ్యకారిణం గుణలుబ్ధాస్స్వయ మేవ సంపదః"

భార్యయు నాశ్లోకమును జేతఁ బట్టుకొని యూరి లోనికిఁ బోయి కట్టిన గడపెల్లఁ దిరిగి తుదకు ధనికుఁడగు నొక వర్తకున కీయ నాతఁ డామెకు నూరు వరా లిచ్చెను. ఆ యమయు మిగుల నానందించి వదినెలతోఁబాటు వ్రత మాచరించుకొనెను. భారవియు నట్లు లాఱుమాసములు భూలోక నరకమగు శిక్ష ననుభవించి భార్యాసమేతుఁడై యింటి కేతెంచెను.

శ్లోకమునుఁ గొన్న వర్తకుఁడు తన భార్య గర్భవతి యైన యొకమాసమునకు ధనసంపాదనకై ద్వీపాంతరమున కేగి పండ్రెండు వత్సరములకుఁ గొంపఁ జేరెను. వచ్చి భార్య

ప్రక్కలోఁ బరుండినవాఁడు పరపురుషుఁడని యనుమానించి భార్యను నాతనిఁ జంపఁ గత్తి నెత్తెను. మంచమునకు వ్రేలాడుచున్న శ్లోకము జదివికొని తొందరపాటు పనికిరా దని నిశ్చయించి భార్యను లేపి ప్రశ్నించెను. భయాశ్చర్య సంభ్రమములు ముప్పిరిగొన నామె భర్తపాదముల కెఱగి కుమారుని లేపి సాష్టాంగ నమస్కార మొనరింపఁజేసి యాతఁడు పుత్రుఁ డని విన్నవించెను. వర్తకుఁడును మన శ్శాంతి నొంది తాను గొనిన శ్లోకమే తన వంశ రక్షణ మొనరించెనని సంతసించి భార్యాపుత్రులతో సుఖముండెను.

# 8. భవభూతి

భవభూతి అసలుపేరు శ్రీకంఠుఁడు. భవభూతి యనునది బిరుదనామము. ఈ మహాకవి యొక రాజు నాస్థానమున కేగి 'సాంబాపునాత భవభూతి పవిత్రమూర్తిః' యని చేయెత్తి యాశీర్వదించెనట. ఆ ప్రభువు ప్రమోద మగ్నమానసుఁడై యాతనికి భవభూతి యను బిరుద ప్రదాన మొనర్చెనట. తదాది యాతని మొదటిపేరు మఱుఁగుపడి భవభూతి యను బిరుదనామమే వ్యవహారమునకు వచ్చెను. పండితులుగూడ నీతఁ డొనర్చిన యీశ్వరీస్తుతి కలరి యీతనిని భవభూతి యనియే పిలువసాగిరి. ఘనశ్యామాది కవివరేణ్యు లీ బిరుదమున కింకొక కారణము గూడఁ జెప్పిరి. భవుఁడు భిక్షుక వేషమున నీకవికి సాక్షాత్కరించి భూతి నిచ్చుట కతమున నతఁడు భవభూతి యయ్యెను. కారణ మేది యైనను భవభూతి నామము మాత్రము సార్థక మయ్యెను.

దక్షిణ హిందూస్థానమున విదర్భ యను రాష్ట్రము గలదు. దీని నిప్పుడు బీద రని వ్యవహరింతురు. ఈ దేశ మును సనాతనాంధ్రులు వెలనా డని పిలిచెడివారు. ఈ రాష్ట్రమునఁగల పద్మపుర మను గ్రామమే యీ మహా కవి జన్మస్థాన మని కొందఱ మతము. ఇందు ఉదుంబరమువా రను సద్బ్రాహ్మణ వంశీయులు గలరు. ఈ వంశమువా రందఱు వేదవేదాంగ పారగులు. ఆహితాగ్నులు. జపహోమ తత్పరులు. వీరిది కాశ్యప గోత్రము. ఈ పవిత్ర గోత్రము

ననే భవభూతి యుద్భవించెను. ఇయ్యది పండితవంశ మని కూడ ప్రసిద్ధిఁ గాంచెను. ఈ కవి పితృపితామహప్రపితా మహులు విద్వన్మణులు. వాజపేయ యాజులు. సోమపీథులు. ఇప్పటికిఁ గూడ తైత్తిరీయులు నాపస్తంభ సూత్రులు నగు బ్రాహ్మణులు నాగపూరు ప్రాంతములందును జాందా పరి సరము లందును గానవచ్చుచున్నారు. కాన నప్పటి విదర్భ రాష్ట్రమున మన తెలంగాణాకూడ కొంత చేరి యుండునని చెప్పవచ్చును.

అది కారణముగ భవభూతి యాంధ్రుఁ డని పెక్కురు విమర్శకుల దృఢాభిప్రాయము. భవభూతి యశోవర్మ యాస్థానకవి. కుమారిలభట్టు శిష్యుఁడు. ఈ గురువుకడ శుశ్రూష యొనర్చియే భవభూతి పూర్వమీమాంస శాస్త్రము నామూలాగ్రముగ నభ్యసించి యందు కూలం కషమగు ప్రజ్ఞ గడించెను.

భవభూతికి ఉదుంబరమువా రని యింటిపే రుండుట గూడ నాతఁ డాంధ్రుఁ డని చెప్పుటకు వీలగుచున్నది. సదాచార సంపన్నులును, కర్మిష్ఠులు నగు సనాతన బ్రాహ్మ ణులు భోజనాదికములకు మేడియాకుల విస్తళ్ళ నుపయోగించెడివారు. భవభూతి పూర్వీకుఁ డొకఁడు తన పెరటి యందు మేడిచెట్టును బెంచి యుండును. అది కారణముగ వీరు మేడివారై యుందురు. దానిని సంస్కృతీకరించి భవ భూతి 'ఉదుంబర నామానః' యని చెప్పుకొని యుండును. గుంటూరునకు గర్తపురి యనియు, చింతలపూడికి ఆమ్లికాపురి యనియు నిప్పటికిని సంస్కృత నామములు వాడుకలో

నుండెను గదా! ఈకవిగ్రంథములను బట్టి యీతఁ డద్వైత మతావలంబి యని నిస్సంశయముగఁ జెప్పవచ్చును.

ప్రథమముననే నాటక రచనకుఁ గడంగిన నాట్య కళాభిమాని యీ కవివతంసుఁడు. ఉత్పాత్య వృత్తమున శృంగార రసము రంగరించి మాలతీ మాధవమును, ప్రఖ్యాత వృత్తమున వీరము జోడించి మహావీర చరితమును, మిశ్రమ వృత్తమున కరుణము మేళవించి యుత్తరరామ చరితమును నీ కవి సృష్టించెను. ఈ రూపకత్రయమును నాట్యసామ్రాజ్యమునకు మణిత్రయము.

మాలతీ మాధవము నందలి యితివృత్తమును నాయికా నాయకులును స్వదేశమున స్వజాతియందు పెంచి పోషింపఁబడిరి. ఏలయన నాయికా నాయకులగు మాలతీ మాధవులు బ్రాహ్మణులు. ఇందు శృంగారము ప్రధాన రసమైనను వీరకరుణాద్భుతాది రసము లంగములుగఁ బోషింపఁబడినవి. ఆనాటి మతాచార సాంప్రదాయము లెన్నియో యీ రూపకము వలన మనకు గరతలా మలకము లగుచున్నవి. ఇందలి శైలి మృదుపదగుంఫితము. కవితా ప్రవాహము గాంగధారాసదృశమై యనర్గళమై యొప్పారుచున్నది.

మహావీర చరిత్ర యందలి యితివృత్తము రామా యణము నందలిదే యైనను నచట నచట నౌచిత్య భంగము గాకుండ ప్రధాన కథకు భిన్నములైన సంఘటనలు గల్పింపఁ బడినవి. దీనికి దాలుత మాలతీ మాధవమున కున్నంత ప్రచారము లేదు. ఇందు బంచమాంకమునఁ గొంతవఱకే

భవభూతి నిర్మితము. తరువాతి రెండున్నర యంకములును నర్వాచీనుఁడగు సుబ్రహ్మణ్యకవి పూరించెను. నేటి ముద్రిత ప్రతులకు మాతృకలు పరపూరితములే. నన్నయ భట్టారకుఁ డధర్వణ భారతమును దగ్ధ మొనరించెనను నభూత కల్పనవంటి కల్పనయే యీ మహావీర చరితము నకును గలదు. 'రాజశేఖరేణ దగ్ధమితి ప్రసిద్ధిః' యను నానుడి వలన రాజశేఖరుఁ డిద్దాని దగ్ధ మొనరింపఁ జేసెనను ప్రతీతి కలదు.

ఉత్తరరామచరితమందు కరుణరసము ప్రధానమని చెప్పియుంటిమి గదా ! భోజుఁడు 'శృంగార ఏక ఏవ రసః' అని చెప్పియుండెను గాని యంత కెన్నఁడో ముందు భవభూతి యుత్తరరామచరితమందు 'ఏకోరసః కరుణ ఏవ' యని నిరూపించి యుండెను. నాటకమును గరుణరసముతోఁ బ్రారంభించుటయే కాక మధ్య మధ్య నవకాశము చిక్కి నప్పుడెల్ల నారసమును గూర్చి జ్ఞాపక మొనర్చుచు, నాటక మాద్యంత మారసమును గుప్పించి సామాజికుల మెప్పించి వారిచే నొప్పించినాఁడు.

ప్రధాన కథాంశము వాల్మీకిదే యైనను రూపకోచితముగ మధ్యమధ్య మార్చి కల్పించినాఁడు. వాల్మీకి కూడ వర్ణింపక విడచిన గోదావరీ ప్రాంతదృశ్యముల నీ కవి యెన్నిటినో వర్ణించినాఁడు. గౌతమీనది యనిన నీకవికి మక్కువ మెండు. ఈతని జన్మస్థలము గోదావరీ తీర మగుటయే దీనికిఁ బ్రబల కారణము. ఒక్క గోదావరీప్రాంతవర్ణన మన నేల ? ఈతని వర్ణన లన్నియు స్వభావసిద్ధములు. అనితర

సామాన్యములు. ప్రకృతిని వర్ణించు పట్టుల నీకవికి బంచవటి, నెమలి, ఏనుఁగు, కడిమిచెట్టు మున్నగునవి ప్రియాతి ప్రియములు. శిఖరిణీ వృత్త మనిన నీ కవికిఁ గడుంగడు నభిమానము. పైఁజెప్పిన మూఁడు కృతులే కాక యీకవిపేరటఁ గొన్ని శ్లోకములు చాటువులు గలవు. 'కిమపి కిమపి మందం మందం' అను భవభూతి శ్లోక మిప్పటికిని లోకోత్తర ప్రఖ్యాతి గాంచినది. ఇట్టి మహాకవుల చరితములు ప్రత్యేక గ్రంథములుగ రచియింపఁబడఁ దగినవియే కాని యంతంత మాత్రములు గావు.

# 9. భట్టబాణుఁడు

'బాణోచ్ఛిష్టం జగత్సర్వ'మ్మని కవికిఁ బ్రసిద్ధి నిప్పించిన కాదంబరి యను గద్యకావ్య రచయిత భట్ట బాణుఁడు. గద్యకావ్యములం దిది యగ్రగణ్యమగుట నెల్ల తీతనిని గద్యకవి సార్వభౌముఁ డందురు. ఇతర పూర్వ కవులవలెఁగాక యీతఁడు తన చరిత్రఁ గొంతఁ దెలిపి చరిత్రకారులకు సహాయపడెను. ఈతఁడు రచించిన హర్ష చరిత్రనుబట్టి యీ క్రింది విషయములు వెల్లడి యగు చున్నవి.

ఈ కవి వాత్స్యాయన వంశజుఁడు. ఆపస్తంబ సూత్రుఁడు. శోణానదికి దక్షిణమున నున్న ప్రీతికూట మీతని నివాసస్థానము. తల్లిదండ్రులు రాజదేవీ చిత్ర భానులు. ఆకాలమున ననులోమ వివాహము లాచారమున నుండుట కతమున నీతని తండ్రి యొక శూద్ర స్త్రీని వివాహ మాడెను. ఆపెకుఁ జంద్రసేన మాత్రషేణు లను నిరువురు పుత్రు లుదయించిరి. వీ రిరువురును బాణునకుఁ బారశవ సోదరులు. ఈశానుఁ డను భాషాకవి యీతని యాంతరంగిక స్నేహితుఁడు.

భట్టబాణుఁడు వేదవేదాంగ పారంగతుఁడు. సాహిత్య విశారదుఁడు. కవితా కళానిధి. ఈతని కవిత్వ పటుత్వ మహాత్వములఁగూర్చి విని శ్రీహర్షుఁడు తన సోదరుఁ డగు కృష్ణభూపాలునిచే తన యాస్థానమునకుఁ బిలిపించుకొనెను. రాజాజ్ఞ నతిక్రమింపఁ జాలక యాతఁ డాస్థాన కవి యయ్యెను.

శిలాదిత్యుఁ డను నామాంతరము గల హర్షవర్ధనుఁడు శా. 528–67 వఱకు కన్యాకుబ్జము రాజధానిగ రాజ్యపరిపాలన మొనర్చి దిగ్విజయయాత్ర యొనర్చెనని చరిత్రకారులు నిర్ణయించిరి. హర్షునకు సమకాలికుఁ డగు నిక్కవి కాలము గూడ నదియే యని నిశ్చయింపవచ్చును ? భట్టబాణ విరచితమగు హర్ష చరితమునకుఁ గథానాయకుఁ డీ హర్షుఁడే.

బాణుఁడు బాల్యమునఁ బార్వతీపరిణయ నాటకము, చండీశతకము, శివాష్టకము, నను గ్రంథముల రచించెను. కౌమారమున హర్ష చరిత మను గద్యకావ్యమును మృదు మధుర శైలిని నిర్మించెను. ప్రౌఢవయఃపరిపాకమున ననితర సామాన్య మగు కాదంబరిని రచించి జగద్విఖ్యాతిని నందుకొనెను. ఈ గద్యకావ్యశైలి కఠినతర మైనను శబ్దార్థ విజ్ఞానముగల పండితులు పఠించి రసాస్వాదన మొనర్తురు. అందువలననే 'కాదంబరీ రసజ్ఞానా మాహారోపిన రోచతే' యను నార్యోక్తి పుట్టినది. ఈ కవి కల్పనా చమత్కారము వర్ణనాసామర్థ్యము ననన్యసామాన్యములు. ఇందలి కాదంబరీ చంద్రాపీడుల కథకు బృహత్కథ మూలాధార మైనను నుపకథలఁ బెక్కిఁటిఁ గల్పించి కవి తన కల్పనా చమత్కృతినిఁ బ్రదర్శించెను. అశేష పండితు లిక్కావ్యమును బ్రశంసించుటయేకాక దీనియందలి యాదరాభిమానములచేఁ బెక్కురు దీనినిఁ దమగ్రంథములకు మూల మొనర్చిరి. కాశీనాథుఁ డను నొక కవి యీ కథను సంగ్రహించి 'సంక్షిప్త కాదంబరి' యను కావ్యమును రచించెను. మణిరామ కవి యను మఱియొక పండితుఁడు 'కాదంబర్యర్థసార' మను పద్యగ్రంథమును

రచించెను. తరువాతఁగూడ ననేక కవులీ కాదంబరీనామముతో ననేక కృతు లొనర్చిరి.

పాపము! భట్టబాణుఁ డీ కావ్యము పూర్తియొనర్పకుండనే పరమపదించెను. ఈతని కుమారుఁ డగు భూషణభట్టు దీనినిఁ బూరించి పితౄణ విముక్తుఁ డయ్యెను. తండ్రి రచించిన గ్రంథమునకుఁ బూర్వభాగ మనియుఁ దనయుఁడు పూరించిన గ్రంథమునకు నుత్తరభాగ మనియుఁ బేర్లు. ఉత్తరభాగము పూర్వభాగమంత ప్రౌఢముగ లేకున్నను, కథా కల్పనమునఁ గుమారుఁడు తండ్రి కేమాత్రము దీసిపోఁ డయ్యెను. కథను జక్కఁగఁ బోషించి భూషణభట్టు దీనిని శుభాంత మొనరించెను.

గుణాఢ్యుని బృహత్కథ యందలి కాదంబరీ కథ కాదంబరీ కావ్యమునకు మూలమని చెప్పితిమి గదా! ఇందలి నాయికానాయకులు కాదంబరీ చంద్రాపీడులు. శృంగారము ప్రధానమైనను దక్కంగల రసము లంగములుగఁ జక్కఁగఁ బోషింపఁ బడినవి. కథాపోషణ మందును బాత్ర పోషణ మందును, వర్ణన లందును నీ కవి యద్భుత సామర్థ్యమును బ్రదర్శించి స్వాతంత్ర్య మార్గ మవలంబించెను. శైలి మిగుల ప్రౌఢము. మున్యాశ్రమము, హిమాలయము, నచ్ఛోదము మున్నగువాని వర్ణనలు హృదయంగమములు; స్వభావసిద్ధములు. శుకనాసామాత్యుఁడు చంద్రాపీడున కొనర్చిన హితోపదేశ మనితరసాధ్యము, అద్భుతము, అనిర్వాచ్యము. మహాశ్వేతా వృత్తాంత మనన్యసామాన్యము.

ఈ గ్రంథ శైలితోఁ బోల్చిచూడఁ బార్వతీ పరిణయ శైలి పేలవముగఁ గాన్పించును. అది కారణముగఁ బార్వతీ పరిణయ కర్తృత్వ విషయమునఁ గొందఱకు సందియము గూడ గలదు. కాని బాల్యమునఁ జేయి తిరుగక ముందు రచించినదది. సిద్ధహస్తుఁడైన పిమ్మట ప్రౌఢ వయస్సున నిర్మించినదిది. పార్వతీ పరిణయ నాటకమునం దైదంకములు గలవు. కథకు మూలము కాళిదాసు కుమారసంభవము. కాని దానికిని దీనికిని పర్వత పరమాణు తారతమ్యము. అది సరసము; ఇది నీరసము.

బాణుఁడు హర్ష చరితమందుఁ దననుఁ గూర్చిన చారిత్రకాంశములు గొన్ని వర్ణించుకొని హర్షచరిత్ర నామూలాగ్రముగ వర్ణించెను. ఈ గ్రంథమం దెనిమిది యుచ్ఛ్వాసములు గలవు. ఇయ్యదియుఁ గాదంబరి వలెనే దేశవ్యాప్తము గాంచి పండిత సమాదరణీయ మయ్యెను. ముకుటతాడితము శారదాచంద్రిక యను మఱి రెండు రూపకము లీకవి విరచితములు గలవందురు. కాని, యయ్యది విచారణీయము.

భట్టబాణునకు సువర్ణాభిషేక మొనరించి సరస్వతికి హర్ష మొడఁగూర్చి శ్రీహర్షుఁడు గీర్వాణ్షుఁ డయ్యె నందురు. బాణుఁడు సరస్వతి యపరావతార మని మఱికొందఱందురు. బాణునకు వక్రోక్త్యలంకార మనిన మిగుల నభిమానము. శ్లేషయందును, శబ్దగుంఫన మందును, రసోత్పాదన మందును కథాకల్పనము నందును బాణుఁడు తన యసమాన్య ప్రతిభను బ్రదర్శించి సర్వసమర్థుఁ డను ప్రతీతిఁ గాంచెను.

అందఱి మహాకవులకు వలెనే బాణునకును నంటఁ గట్టఁబడిన యొక కట్టుకథ నారయుఁడు.

బాణమయూరులు బావమఱుదులు. మయూరుఁడొక నాఁడు చుట్టపుఁ జూపుగ సోదరియింటి కేతెంచెను. యథోచిత సత్కారానంతరము నాఁటిరాత్రి మయూరుఁడు చావడిలోఁ బరుండెను. ఆ రాత్రియే బాణునకును భార్యకును బ్రణయకలహము సంభవించెను. భర్త యెంత బ్రతిమాలినను భార్య తన పట్టినపట్టు వదలి ప్రసన్న గాదయ్యెను. తుదకు భర్త చేయునది లేక భార్య పాదముల కెఱఁగెను. అప్పటికిని భార్య యెక్కిన మెట్టు దిగదయ్యెను. భర్త ప్రాణము విసిగి గత్యంతరము లేక ఈ క్రింది శ్లోకముఁ జదువ నారంభించెను.

"గతప్రాయా రాత్రిః కృశతను! శశీశీర్యత ఇవ
ప్రదీపోయం నిద్రావశ ముపగతో ఘూర్ణిత ఇవ
ప్రణామాన్తో మానః త్యజసిన తథాపి క్రుధమహో!"

ప్రియా! రాత్రి సమాప్తమై తెల్లవాఱ వచ్చినది. చంద్రుఁడు క్రిందికి జారిపోవు చున్నాఁడు. దీపము కునికిపాట్లు పడుచున్నది. దాసునితప్పులు దండముతో సరి యందురు. కాని నమస్కరించినను నీవు కోపము వదలకున్నావు.

మెలకువతోనున్న మయూరుఁ డీ పాదత్రయమును వినెను. తత్క్షణ మప్రయత్నముగ నాతని నోటనుండి ఈ క్రింది పాదము వెడలెను.

కుచప్రత్యాసత్త్యా హృదయమపి తే చండి! కఠినమ్.

స్తనసామీప్యకతమున నీ హృదయము కూడా కఠినమైనది.

ఈమాటలు విని బాణుఁడు బయటికివచ్చి మండిపడి 'నీసోదరి నిట్లనుచితముగ వర్ణించితివి కానఁ గుష్ఠురోగివి కమ్మ'ని శపించెను. మయూరుఁడు 'నేను పద్యపూర్తి కట్లంటిని గాని ప్రకరణము గ్రహించి చెప్పినది కాదు. నిజానిజము తెలియఁగక త్వరపడితివి కాన నీవు క్షయరోగార్తుడవు కమ్మ'ని బదులు శాప మిచ్చెను. మయూరుఁడు సూర్యశతకమును, బాణుఁడు చండీశతకమును నిర్మించి తమతమ శాపముల నుండి విముక్తులైరి. ఈ కథయు నితర కథలవలెనే కల్పితము గాని యేమాత్రము విశ్వసింపఁ దగినది కాదు.

# 10. శంకరాచార్యులు

కాలము గడచిన కొలఁదియు మహాత్ముల జీవితముల కద్భుత చరిత్రములును నభూత కల్పనలు నంటఁగట్టుట సహజము. అట్లే జగద్గురు శ్రీ శంకరాచార్యుల జీవితము చిత్ర విచిత్ర కథలతో నిండిపోయినది. ఈ మహాపురుషుని జీవిత మొక్క సంస్కృత భాషలోనే కాక మన దేశ భాష లన్నిఁటి యందును విదేశీయ భాషలందుఁ గూడ చిత్రవిచిత్రముగ వర్ణింపఁబడి యున్నది. ఈయన మాహాత్మ్యమును దెల్పు కథ లనేకములు గలవు. కాని, గ్రంథ విస్తరభీతి నవి యన్నియు వదలఁబడినను నొకటి రెండు మాత్ర మప్రస్తుతములు గావు.

మన దేశమున నిప్పుడు మలబారని పిలువఁబడు కేరళ రాష్ట్రము గలదు. అందుఁ బూర్ణ యను నదీమతల్లి కలదు. దానికి జేరువగ వృషాద్రి యను పర్వతము కలదు. అయ్యది నిత్యకల్యాణము పచ్చతోరణమునై నయనానందకరముగ నుండును. దాని సమీపమున కాలటి యను నగ్రహారము కలదు. అందు విద్యాధిరాజను బ్రాహ్మణోత్తముఁడు గలఁడు. ఆతఁడు పండితోత్తముఁడు. శ్రౌతకర్మాచరణ మున నద్వితీయుఁడు. ఆ ప్రాంతవాసులకుఁ బరమ ప్రామాణికుఁడు. ఈ పండితవరేణ్యుని కుమారుఁడు శివ గురువు. శివగురువు భార్య ఆర్యాంబ. వృషాధీశ్వరు ననుగ్రహమున నీ పూజ్యదంపతుల కొక్క శుభముహూర్త మున నొక మగశిశు వుదయించెను. శంకర ప్రసాదమున నుద్భవించుట కతమున మాతాపిత లాబిడ్డకు శంకరుఁ డను

నామకరణ మొనర్చిరి. దినదినాభివృద్ధిఁ గాంచుచు నాబిడ్డ రెండేండ్లు నిండకముందే సకల భాషలలోని యక్షరములను నేర్వఁగల్గెను. కాని పాపము! మూఁడవ యేటనే తండ్రి పరలోకగతుఁ డయ్యెను. శిశుపోషణ భారము తల్లి యగు నార్యాంబపైఁ బడెను. పంచశరద్వయస్కుఁడగు నాబాలు నకుఁ దల్లి యథావిధిగ నుపనయన సంస్కార మొనర్చెను. తదాది యాతఁడు బ్రహ్మచర్యవ్రతపాలన మొనర్చుచు గోకర్ణ క్షేత్రమున కరిగి గురుకుల విద్యాభ్యాస మొనర్ప నారంభించెను. ఏకసంథగ్రాహి యగు నాబాలుఁ డచిరకాలముననే వేదవేదాంగపారంగతుఁడై, సకల విద్యలఁ గరత లామలక మొనర్చుకొని సహాధ్యాయులకు బోధింపఁ దొడఁగెను. ఈతని మేధాసంపత్తికి గురువు లాశ్చర్య మగ్న మానసులై యీతఁ డొక యవతార పురుషుఁడు గాని సామాన్య మానవుఁడు గాఁడని యభిప్రాయపడిరి.

శంకరుఁ డొకనాఁటి మధ్యాహ్నమున తన సహా ధ్యాయులతోఁ గూడ భిక్షార్థము గ్రామములోని కేఁగెను. కొంత తడవున కాతఁ డొక బ్రాహ్మణ గృహముఁ జేరెను. వారు కడు బీదలు. గృహ యజమానుఁడు గూడ గ్రామము లోనికి యాయవరమునకై వెళ్ళెను. నిరుపేదరాలగు నా గృహిణి తాము చాల బీదల మనియు శంకరునివంటి మహాత్ములఁ బూజించు భాగ్యము లేదనియు మిగుల దీనముగఁ బలికెను. అయిన నింటికి వచ్చిన యతిథి నూరక పంపుట భావ్యము కాదని యాతని కొక యామలకము భక్తి పూర్వకముగ దాన మొసఁగెను. ఆసద్బ్రాహ్మణి దారిద్ర్య మునకు శంకరుఁడు మిగుల వగచి యామెకు భాగ్యము

నొసఁగు మని భాగ్యాధి దేవత యగు లక్ష్మీదేవిని స్తుతించెను. తత్క్షణమే యామె యింటినిండ బంగారపు టుసిరికకాయలు వర్షించెను. ఆ బ్రాహ్మణియు నాశ్చర్యమగ్నమానసయై శంకరు ననేక విధముల స్తోత్ర మొనరించెను.

గురుకులావాసము పూర్తియొనర్చి సకలవిద్యాపారంగతుఁడై శంకరుఁ డింటికే తెంచెను. ఒకనాఁడు సూర్యాతపము మిగుల తీక్ష్ణముగ నుండెను. ఆ మండుటెండలో నార్యాంబ నదికి స్నానార్థ మేగెను. కాని యంతదూరమునుండి యిలు సేరలేకపోయెను. శంకరుఁ డెదురుగఁ బోయి యుపచారాదికము లొనర్చి యెట్లో యింటికిఁ జేర్చెను. తల్లికి స్నానసౌకర్య మొనర్పఁ దలఁచి యా నదికడ కేఁగి దానిని స్తోత్ర మొనర్చెను. నదీమతల్లియుఁ బ్రసన్న మయ్యెను. మఱునాఁడు తెల్లవారకమున్నె యమ్మహానది శంకరుని యింటి సామీప్యమునఁ బ్రవహింపసాగెను. కుమారుని మహిమకు జనని మిగుల నానందించి యనుదిన మానదియందు సుఖస్నాన మొనరించు చుండెను. శంకరునకు దైవికములగు శక్తు లుండె ననుట కీ రెండు కథలును దార్కాణములు చాలు.

అదియునుఁగాక శంకరుఁడు జీవించినది ముప్పదిరెండు సంవత్సరములు మాత్రమే. ఈ స్వల్పకాలమున వేదవేదాంగాది సమస్తవిద్య లభ్యసించి, శతాధిక గ్రంథకర్తయై, యాసేతు హిమాచలము పాదచారిగనే సర్వ పుణ్యక్షేత్రము లారసి, దేశమంతటిని నద్వైతమున ముంచియెత్తి సమస్త నాస్తికమతముల నాశన మొనర్పఁజాలుట దైవాంశసంభూతులకుఁ గాక సామాన్య మానవుల కలవియగు కార్యమే!

శంకరుఁడు మిగుల రూపసి. దివ్యపురుష లక్షణము లుట్టిపడు నాతని యవయవములే దేవాంశ సంభూతుఁ డని చెప్పక చెప్పుచుండెను. ఆతని ముఖపద్మమున బ్రహ్మవర్చసము తాండవ మాడుచుండెడిది. అష్టవర్ష ప్రాయుఁ డగుటకు మున్నె యాతఁడు వేదశాస్త్రము లన్నింటిని హృదయస్థము గావించుకొని వానియం దఖండ పండితుఁ డయ్యెను. సర్వజ్ఞుఁడగు శంకరునకు సమస్త కళలందును సర్వవిద్య లందును గొప్ప ప్రావీణ్యము గలదు.

ఐహిక భోగపరాఙ్ముఖుఁడగు శంకరుఁడు సన్యసింపఁ దలఁచి తల్లి యానతి నభ్యర్థించెను. కాని, దుఃఖాకుల మానసయగు మాత 'వివాహ మొనర్చుకొని, పితౄణ విముక్తుఁడవై నన్నుఁ గడతేర్చిన పిమ్మట సన్యసింపు' మని హిత వొసఁగెను. తల్లి యాజ్ఞ జవదాటనేరక శంకరుఁ డట్లే కాలము గడుపుచుండెను. కతిపయ కాలమునకు శంకరుఁ డొకనాఁ డింటి చేరువనున్న నదిలో స్నానము చేయుచుండ నొక మొసలి పట్టుకొనెను. శంకరుఁ 'డమ్మా! నన్ను మొసలి పట్టుకొన్నది. బాధ మిక్కుటముగ నున్నది. నా ప్రాణములు నిలువఁజాల' వని పెద్దపెట్టున వాపోయెను. ఆ పెడబొబ్బలు విని తల్లి యగు నార్యాంబ వెలుపలికి వచ్చి 'నాయనా! నిన్నిప్పట్టున రక్షించువా రెవ్వరును లేరే! అయ్యో! మాలదైవ మెంతలో నెంత యొనర్చె' నని గుండెలు బాదుకొనెను. శంకరుఁ 'డమ్మా! విలపింపకుము. నేఁటితో నాకు నూఱేడులు నిండినవి. ఈ గండము తప్పదు. ఇప్పుడు నేను సన్యాసాశ్రమము స్వీకరించినచో జన్మాంతమయి నూతన జన్మము వచ్చిన ట్లగును. అప్పుడు నన్నీ నక్రము

విడువఁగలదు. కాన శీఘ్రముగ నాశ్రమ స్వీకారమున కనుజ్ఞ యిమ్మని ప్రార్థించెను. ఏదియో యొక యాశ్రమమునఁ బుత్రుఁడు సజీవుఁడై యుండినఁ జాలు నని జనని వెంటనే యనుజ్ఞ నొసఁగెను. మానసికముగా నాతఁడు సన్న్యాసాశ్రమము స్వీకరించి గ్రాహవిముక్తుఁ డయ్యెను. ఇట్టిదానినే యాతురసన్న్యాస మందురు.

ఆశ్రమ స్వీకారానంతరము శంకరుఁడు తల్లియాజ్ఞఁ బడసి దేశ సంచారమునకు బయల్వెడలెను. తదుపరి కాశీ మున్నగు పెక్కు పుణ్యక్షేత్రముల కేఁగెను. నర్మదా తీరమునఁగల యమరేశ్వర క్షేత్రమున కేఁగి గోవింద భగవత్పాదునకు శిష్యుఁ డయ్యెను. బదరికాశ్రమమున కేఁగి బదరీనారాయణుని సేవించి యచట భాష్యరచన కుపక్రమించెను. అప్పటికి శంకరుఁడు ద్వాదశ వర్ష ప్రాయుఁడు. శంకరుఁడు ప్రప్రథమమున మీమాంసా భాష్యము, ఉపనిషద్భాష్యము, గీతాభాష్యము నను మూఁడు భాష్యములు రచించెను. వీనికే ప్రస్థాన త్రయ మను ప్రసిద్ధి గలదు. భాష్యగ్రంథములే కాక పెక్కు ప్రకరణ గ్రంథములు, ననేక లఘు గ్రంథములును రచించి శతాధిక గ్రంథకర్త యయ్యెను. ఇట్టి స్వల్పాయుష్కాలమున నిన్ని గ్రంథములు రచించిన కవి యింకొకఁడు లేఁడు. పండిత పామర పఠనార్హమగు నీతని భజగోవిందస్తుతి యెంత ప్రజామోదమును బొందెనో చెప్ప నయితిగాదు.

శంకరుఁడు గ్రంథరచన ద్వారమున భాషాసేవ యొనర్చుటయే కాక దేశమంతయుఁ గ్రుమ్మరి సమస్త నాస్తిక మతముల నాశన మొనరించి యద్వైత మతోత్కృష్టతను బ్రతిష్ఠించెను.

శంకరుఁడు మండనుఁ డను పండితునితో వాద మొనర్చి యాతని పరాజితు నొనర్చిన గాథ విచిత్రముగ నుండును. కాన దానినిఁ జెప్పి ఈ కవి చరిత్ర ముగింతము.

శంకరుఁడు వాదార్థము మండనపండితుని గృహమున కేఁగెను. క్రమక్రమముగ వాదోపవాదములు జెలరేగెను. 'ఒంటరిగ నీ కంఠశోష యేల! సభామధ్యమున మధ్యవర్తి యెదుట వాదించుకొంద' మని యిరువురును నిర్ణయించుకొనిరి. పండితు లిద్దరును మండనపండితుని ధర్మపత్ని యుదయభారతి మాధ్యస్థ మంగీకరించి శాస్త్రవాదమునకుఁ గడంగుద మనుకొనిరి. వారిరువురు ఘోర ప్రతిజ్ఞ లొనర్చుకొనిరి. 'నేను వాదమునఁ బరాజయ మందితినేని నా సన్యాసమును వదలి కాషాయాంబరములఁ ద్యజించి తెల్లని వస్త్రముల ధరించి నీకు శిష్యుఁడ నయ్యెద' నని శంకరుఁడు ప్రతినఁ జేసెను. 'నేను పరాజితుఁడ నైనచో నీకు శిష్యుఁడనై సన్యాసాశ్రము స్వీకరించి కాషాయ వస్త్రముల ధరింతు'నని మండనమిశ్రుఁడు శపథ మొనర్చెను.

పరస్పర జిగీషువులగు నా పండితు లిర్వురు నిట్లు ఘోర ప్రతిజ్ఞలు గైకొని వాదమునకుఁ దిగిరి. ఉదయభారతి కొంతతడవు గూర్చుండి వారి వాదతీవ్రతను గమనించి యది యంతలోఁ దేలునది కాదని గ్రహించి రెండు పుష్పమాలలు దెప్పించి వారిరువురి కంఠములందు వైచెను. ఎవరి కంఠమున నున్న పూలమాల వాడునో యతఁడు పరాజితుఁడైనట్టు లొప్పుకొనవలె నని చెప్పి తానింటి కేఁగెను. వేదవేదాంగములందలి ప్రమాణ వాక్యముల నెత్తిచూపుచు వారి వారి

వాదముల కనుకూలముగ వ్యాఖ్యానించుచు నిరువురు చాఁ తడవు తీవ్ర శాస్త్రచర్చ యొనర్చిరి. ఇట్లు పదునాలుగు దినములు పండితు లిద్దరు నొకరి నొకరు తీసిపోక యుక్తిపై యుక్తులతో వాదోప వాదము లొనర్చిరి. క్రమక్రమమున మండనపండితుని వాదము దుర్బలము కాసాగెను. శంకరుని యుక్తి ప్రమాణములకు లొంగి మండనుఁడు నిరుత్తరుఁ డాయెను. ఆతని మెడలోని పూలమాల వాడిపోయెను.

పిమ్మట నుదయభారతి గూడ శంకరునితోఁ బదునేడు దినములు శాస్త్రవాద మొనర్చి వాదమున నిలువఁ జాలక వీగిపోయెను. శంకరుఁడు బాల్యముననే సన్యసించెను గాన కళాశాస్త్ర రహస్యము లాతనికిఁ దెలిసి యుండవని యెంచి యుదయభారతి యా శాస్త్రమునం దొక ప్రశ్న నిచ్చెను. కాని, సర్వజ్ఞుఁ డగు శంకర పూజ్యపాదునకుఁ దెలియని విషయ ముండునా ? ఆతఁ డందులకుఁ గూడ తృప్తికరమగు సమాధాన మిచ్చి విజయము గాంచెను. మండనపండితుఁడు ముండన మొనరించుకొని సన్యాసాశ్ర మము స్వీకరించి శంకరాచార్యునకు శిష్యుఁ డయ్యెను. భారతి యపరావతారమగు నుదయభారతి యంతర్హితయై సత్యలోకమున కేఁగెను.

శంకరుని యద్భుత మహిమల నిరూపించు నిట్టి కథలు పెక్కులు గలవు. కాని యవి ప్రత్యేక గ్రంథరూపము నొందవలసినవి.

# 11. మాఘుఁడు

ఈ మహాకవి తన కావ్యాంతమున జెప్పిన శ్లోకముల వలన నీతఁడు శ్రీ వర్మలరాజు నాస్థానమందు సర్వాధికారి యగు సుప్రభదేవుని మనుమడైనట్లు తెలియుచున్నది. ఇతని తండ్రి సత్యవాక్తత్పరుఁడు నుదారుఁడు నగు దత్తకుఁడు. ఇంతకుఁదప్ప నీకవి తన దేశకాల నివాసాదులఁ గూర్చి యెచటను జెప్పికొని యుండలేదు.

ఒకానొక వ్రాత ప్రతియందు మాత్రము తాను భిన్న మాలవ పురవాస్తవ్యుఁడ నని చెప్పికొనిన ట్లున్నది. మాలవ దేశమునకు ఘూర్జర దేశమునకును సరిహద్దున భిన్నమాలవ యను గ్రామమున్నదట. ఈ కవికాల విషయమునఁగూడ పరిశోధకులందు భిన్నమతము లుండుటఁబట్టి నదియు సందిగ్ధముగనే యున్నది. దారిద్ర్యబాధ పడఁజాలక యీతఁడు భార్యాసమేతముగఁ బోయి భోజు నాశ్రయించి యాతని యాదర మందఁజాలెనని కొందఱందురు.

మాఘుఁడు శబ్ద తర్క వేదాంతాది శాస్త్ర పారంగతుఁడు. చిత్ర యమకబంధాది కవిత్వ ప్రియుఁడు. కవితా కలానిధి. కాళిదాసుని యుపమాలంకార ప్రియత్వమును, భారవి యర్థగౌరవమును, దండ్యాచార్యుని పదలాలిత్యమును రాశీభూతమై యీ కవియం దొప్పారుచున్నవని ప్రతీతి. కనుకనే 'మాఘే సంతి త్రయో గుణాః' యను నార్యోక్తి పుట్టినది. మల్లినాథసూరికి వ్యాఖ్యాన మనిన మంచినీటి ప్రాయము గదా! అట్టి ఘటికుఁడుగూడ 'మేఘే మాఘే గతం వయః' అనినాఁడు.

ఇతఁడు దుష్టశిక్షకుఁడు శిష్టరక్షకుఁడు నగు శ్రీకృష్ణ భగవానుఁడు శిశుపాలుని వధించుట యను భారతామ్నాయ మందలి కథను మూలముగ గ్రహించి యిరువది సర్గల కావ్యమును స్వతంత్రముగ రచించెను. గ్రంథ మామూలాగ్ర మీ కవి సర్వశాస్త్ర పరిజ్ఞానము వెల్లివిరియుచున్నది. పదునాలుగవసర్గ యీతని కూలంకష శాస్త్ర పాండిత్యము నకు నిదర్శనము. ద్వితీయ సర్గము రాజనీతి ప్రదర్శనమం దద్వితీయము. ఆంధ్ర దేశమున నీ సర్గయందలి శ్లోకము లన్నియు నెట్టి తేళ్ళను ప్రతీతి గలదు. సంస్కృత విద్యార్థులకు పంచ కావ్యములం దిది మిక్కిలి ప్రధానము. ఈ కావ్యము పఠించినవారికి శబ్దజ్ఞాన మలవడుట మిగుల సుకరము.

శిశుపాలవధయందు జగన్నాయకుఁ డగు శ్రీకృష్ణ భగవానుఁడే కావ్యనాయకుఁడు. ప్రధానరసము వీరము. తక్కుఁగల శృంగారాది రసము లంగములుగఁ బోషింపఁ బడినవి. కొలఁది చాటుశ్లోకములు తప్ప నీ కవిపేరట నిదిగాక మఱియొక కృతి కానరాదు. ఒకవైపు నుదయ భానునితోడను వేఱొకవైపు నస్తమిత చంద్రునితోడను నొప్పారు రైవతకాద్రి యిరుపార్శ్వముల ఘంటలతో నొప్పు మత్తేభముతో నుపమించుటఁ జేసి యీ కవికి ఘంటా మాఘుఁ డను పేరు ప్రసిద్ధమయ్యెను.

# 12. శ్రీహర్ష కవి

శ్రీహర్షకవి శ్రీహీరపండితుని పుత్రుఁడు. తల్లి మామల్లదేవి. కాన్యకుబ్జేశ్వరుఁ డగు జయచంద్రునిచే నాసన తాంబూలద్వయాది సత్కారము లందినవాఁడు. ఈ విషయ మాతఁడు నిర్మించిన నైషధము వలననే తెలియుచున్నది. ఈతఁడు 12వ శతాబ్దమువాఁడని శాసనప్రమాణములు గలవు.

కాన్యకుబ్జ పాలకుఁ డగు గోవిందచంద్రుఁడు వారణాసీ నివాసి. ఆతనికి విజయచంద్రుఁ డను కుమారుఁడు గలఁడు. విజయచంద్రుని పుత్రుఁడు జయంతచంద్రుఁడు. ఈ జయంత చంద్రుఁ డేడువందల యోజనముల మేరగల భూమిని జయించి రాజ్యపాలన మొనరించెను. మహాజేతయగు మేఘచంద్రుఁ డాతని తనయుఁడు. ఆతని దాసి గోమతి యిఱువదివేల గుఱ్ఱపుదళమున కధినేత్రి. శత్రురాజు లాపె పేరు విని నంత మాత్రమున వడవడ వడఁకుచుండెడివారు.

జయంతచంద్రుని యాస్థానియందు దిగ్దంతు లగు విద్వాంసు లనేకు లుండెడివారు. అందు శ్రీహీరుఁడుగూడ నొక్కరుఁడు. శ్రీహీరుఁ డొక్కనాఁడు రాజాస్థానమున నుదయనుఁ డను పండితునితో శాస్త్రవాద మొనర్చి పరాజితుఁ డయ్యెను. తదాది యుదయనునకును శ్రీహీరు నకును బద్ధవైరము. కతిపయకాలమునకు శ్రీహీరునకు మరణకాల మాసన్నమయ్యెను. ఆ సమయమున శ్రీహీరుఁడు పుత్రుఁడగు శ్రీహర్షునిఁ జేరఁజీరి "పుత్రా! రాజసమ్ముఖమ్మున నుదయన పండితున కోడితిని. ఆ యపజయము నన్ను

హృదయశల్యమై వేధించు చున్నది. నీవు సుపుత్రుఁడవైన యెడల నాతని రాజాస్థానమున నోడింపు" మని యాజ్ఞ నొసఁగి పరమపదించెను. శ్రీహర్షుఁ డందుల కంగీకరించి పర దేశముల కేఁగి పలువు రుపాధ్యాయుల నాశ్రయించి సకల శాస్త్ర నిష్ణాతుఁ డయ్యెను. సద్గురూపదిష్టమగు చింతామణీ మంత్రమును గంగాతీరమున నొకవత్సరము దీక్షమెయి జపించి మంత్రసిద్ధిఁ గాంచి శారదాదేవినిఁ బ్రత్యక్షీకరించుకొనెను.

తదాది శ్రీహర్షుఁడు రాజసభలం దనేక పండితగోష్ఠుల నెఱపి పండితులకు సహితము దుర్గ్రాహ్యములగు సంభాషణలు చేయుచుండెను. ఈ యతి విద్యయు నాతనికి దుఃఖహేతు వయ్యెను. ఆతఁడు మరల శారదను బ్రత్యక్ష మొనరించుకొని 'తల్లీ! నీ వొసఁగిన యతి ప్రజ్ఞయు నాకు దుఃఖజనక మయ్యెను. సుబోధమగు వాక్కు నిమ్మని వేఁడుకొనెను. అంత నా దేవి ప్రసన్నయై 'వత్సా! అర్ధరాత్రమునఁ దలనిండ చన్నీటి స్నాన మొనరించి పెరుగు ద్రావి నిదురింపుము. కఫ మంకురించుట వలన బుద్ధి మాంద్యము కలుగు' నని యానతిచ్చెను. ఆతఁడు నట్లే యొనర్చి సుబోధ్య వాక్కాయెను. పిమ్మట జయంత చంద్రుని యాస్థానికిఁ బోయి తాను సకల విద్యల నార్జించి వచ్చితినని చెప్పెను. జయంత చంద్రుఁడు పండితసమేతుఁడై యాతని కెదురేఁగి యర్ఘ్యపాద్యాదు లొసంగి సాష్టాంగ మెఱగెను. శ్రీహర్ష కవి భావగర్భితమగు నొక శ్లోకమున రాజు నాశీర్వదించి యందలి భావమును వివరించెను. పండితు లెల్లరు పరమానంద భరితులైరి. అంతఁ దనతండ్రి

వైరియగు నుదయనుని శాస్త్రవాదమున నోడించి, యా శాస్త్ర చర్చ నంతయు నిమిడ్చి ఖండన ఖండఖాద్య మను నుద్గ్రంథమును రచించెను. రాజు, పండితు లిరువ్వుర కును సఖ్య మొనర్చి సత్కారము లఖండము లొనర్చెను.

ఒకానొకనాఁడు రాజు శ్రీహర్షు నొక్క ప్రబంధ రత్నము రచింపు మని వేఁడెను. అంత శ్రీహర్ష కవి వ్యంగ్యభావ సమంచితమును విద్వదౌషధము నగు నైషధము నిర్మించి రాజునకుఁ జూపెను. రాజును 'కవిపుంగవా! నీ కృతియొక్క ౌత్కృష్ట్యము వర్ణనాతీతము. దీనినిఁ గొంపోయి కాశ్మీర దేశ పండితులకుఁ జూపుము. అచటి పండిత పీఠమున సాక్షాత్కరించి యున్న శారదాదేవి చేత నుంపుము. కావ్యము సరసమైన నా దేవి యంగీకరించును. నీరసమైన విసరి యావల పారవేయును. దేవి యంగీకరించిన యెడల దేవతలు పుష్పవృష్టి గురియింతు ' రనెను.

శ్రీ హర్షుఁడు కాశ్మీరమున కేఁగి తన గ్రంథమును బండితులకుఁ జూపెను. తదనంతరము భారతి చేతియం దుంచెను. ఆమెయు నా ప్రబంధమును విసరి గిరవాటువైచెను. శ్రీహర్షుఁ డాగ్రహించి 'నీ కేమైన మతిఁ దప్పెనా? ఇతరుల ప్రబంధమువలె నా ప్రబంధమును దిరస్కరించితి ' వనెను. ఆ దేవి 'నీవు నా రహస్యమును బయట పెట్టితివి. పదునొకం డవ సర్గమున నన్ను విష్ణుపత్నినిగా వచించితివి. అందువలన నీ గ్రంథము విసరివైచితి' ననెను. శ్రీహర్షకవి 'నీ వొకా నొక యవతారమున విష్ణుమూర్తిని భర్తగాఁ బడసితివి. ఇట్లని పురాణములు ఘోషించు చున్నవి. అలిగిన మాత్ర

మున నంటిన యపవాదు యపురూప మగునా?' యనెను. అంత నా వాగ్దేవి యా గ్రంథము స్వహస్తములతో నందికొని పండిత సమక్షమునఁ బలువిధములఁ బొగడసాగెను.

శ్రీహర్షుఁడు పండితమండలిని 'ఈ గ్రంథమును మీ నృపాలుఁ డగు మాధవసేనునకుఁ జూపి, శుద్ధ మని జయంత చంద్రునకు జాబు వ్రాసియిం'డని కోరెను. భారతి యంగీక రించినను బండితులు మాత్రము కమ్మ నీయరైరి. 'దేవుఁడు వరమిచ్చినను బూజారి వరమీయఁడు' గదా! రాజునకు గ్రంథముఁ జూపరైరి. శ్రీహర్షుఁ డటఁ జాలకాలము వేచి యుండెను. తెచ్చికొనిన సొమ్మైపోయినది. వస్తువాహనములు గూడ నమ్ముకొని తినవలసి వచ్చెను.

ఒకనాఁడు నదీతీరమునఁ గల దేవాలయపుఁ బావికడ శ్రీహర్షుఁడు రుద్రజప మొనరించుకొనుచుండెను. అదే సమ యమున మంచినీటికై వచ్చిన చేడియ లిరువురు ముందు వెనుకలకై తమలోఁ దాము వాగ్వాద మొనర్చుకొని, కొంత వడికి మాటలు ముదిరి యొండొరులపైఁ జేయి చేసికొనిరి. గ్రుద్దులాట పర్వము సాంగోపాంగమై రాజాస్థానమున నభి యోగ మొనర్చుకొనిరి. రాజు 'సాక్షు లున్నారా?' యని ప్రశ్నించెను. వారును 'నచట నొక బాపఁడు జప మొనర్చుకొను చున్నాఁడు. అంతకుఁ దప్ప మఱి యేరును లే'రని వాక్రుచ్చిరి. పార్థివుఁ డాపాఱునే తెమ్మన రాజభటులు పోయి యాతని రాజు కడకుఁ దీసికొని వచ్చిరి. రా జాతని సాక్ష్యముఁ జెప్పుమనఁ దాను వైదేశికుఁడ ననియుఁ దన కా దేశభాష రాదనియు నుడివెను. వాది ప్రతివాదుల మాటలు

మాత్ర మున్న దున్నటులఁజెప్పఁగలనని గీర్వాణ భాషయందు వ్రాసిచ్చెను. రాజును 'నట్లే కానిమ్ము. చూత' మన శ్రీహర్షుఁడు వారి మాట లన్నియు నామూలాగ్రముగ సక్రమముగ నప్పగించెను. నరపాలుఁడు చేటికలకు న్యాయము జెప్పి హర్షుని ధారణాశక్తి కచ్చెరువడి 'మీ రెవర' ని ప్రశ్నించెను. ఆతఁడును 'రాజా! మీ యాస్థాన పండితులొనర్చిన యకృత్యమువలన నీ పట్టణమున నిట్టి యిక్కట్టులఁ గుడుచుచుంటి' నని చెప్పెను. నృపాలుఁడు పండితులను రావించి మందలించి శ్రీహర్షుని సత్కరింపుఁ డని యాన తిచ్చెను. వారును నట్లే సలిపిరి. పండితులు కవి గోరిన లేఖను వ్రాసియిచ్చిరి. ఆతఁ డద్దానినిఁ గొంపోయి జయంత చంద్రున కర్పించెను. ఆతఁడును సంతసించి కావ్య మంగీకరించెను. తదాది యా దివ్యప్రబంధము లోకవ్యాప్తమయ్యెను.

జయంతచంద్రుని ప్రధానమంత్రి పద్మాకరుఁడు. ఆతఁ డొకనాఁ డణహిల్లపురమునకుఁ బోయెను. పుర బాహ్య ప్రదేశమున నొక మడివేలు నొక చీర నుదికి యారఁగట్టెను. దానిపై తేం ట్లనేకము ముసరెను. పద్మాకరుఁ డా వలువదాల్చుస్త్రీ పద్మినీజాతి స్త్రీయై యుండునని యెంచి యాపెను దనకుఁ జూపు మని రజకు నడిగెను. ఆ రేవఁడును సాయంకాలము చీరనుఁ గొంపోయి సూహకదేవి యను దాని యజమానురాలి కిచ్చెను. ఆపె వితంతువు, శాలాపతి యనువాని భార్య. మిగుల సౌందర్యవతి. పద్మాకరుఁడు కుమారపాలుని వలన నామెను స్వాధీన మొనర్చుకొని తన రాజున కుంపుడుగత్తెను గావించెను.

ఆయమ గొప్ప విదుషీమణి. అఖర్వ గర్వితురాలు, శ్రీహర్షుఁడు నవభారతియై యుండ నాయమ కలాభారతి యని ప్రసిద్ధిఁగాంచెను. ఆపెకు శ్రీహర్షునిపై మాత్సర్యము మెండు.

ఒకనాఁడాపె సగౌరవంబుగ (శ్రీ)హర్షునిఁ దనయింటికి రావించి 'నీ వెవర' వని యడిగెను. ఆతఁడు తాను కలా సర్వజ్ఞుఁడ నని ప్రత్యుత్తరించెను. అట్లయిన 'నాకు కాలి జోడు కుట్టి తెమ్మ'ని యా యుంపుడుకత్తె సగర్వముగఁ బల్కెను. చర్మకార కృత్యము గూడ చతుష్షష్టి కళలలో నొకటిగానఁ గాదనినఁ దన కలాసర్వజ్ఞత్వమునకు లోటు వాటిల్లు నని యాతఁడు వల్లె యనెను. ఇంటికేఁగి పోక పొత్తులతోఁ జెప్పులు కుట్టి తెచ్చియిచ్చెను. (శ్రీ)హర్షుఁడు దవ్వుదవ్వుల నిలబడి 'జోడుపై నీళ్ళు జల్లుకొనుఁడు. నేను మాదిగవాఁడ' నని చెప్పి వెడలిపోయెను. ఈ యకృత్యము రాజు దృష్టికిఁ దెచ్చి తాను సన్యాసాశ్రమము స్వీకరించి గంగాతీరమునఁ దప మొనర్చుకొన నేఁగెను.

ఒకప్పుడు జగద్గురు (శ్రీ) శంకరాచార్యుల శిష్యు లీ మహనీయునితోఁ బండితవాదమున కేఁగిరి. అప్పు డీ కవి వతంసుఁడు బంగారు చేరుల పసిడియుయ్యేల నూగుచుండెను. పండితుల రాక గమనించియు గౌరవసూచకముగఁ గ్రిందికి దిగఁడయ్యెను. అంత వారు 'అత్యుచ్ఛ్రియః పతనహేతుః' మిక్కిలి యౌన్నత్యము పడుటకే హేతువనిరి. (శ్రీ)హర్షుఁడు 'ధ్రువే అవ్యాప్తిః' ధ్రువుఁడు పడుటలేదే యనెను. వారు 'ప్రళయే తస్యాపి పతనసంభవః' ప్రళయకాలమున నాతఁడును పడు ననిరి. అంత నా కవిగ్రామణి 'తదా సర్వేషాం

పతనమేవ' అప్పు డందఱును పడుదు రని వారి నోరు మూయించెను.

రత్నావళ్యాది గ్రంథకర్తయగు శ్రీహర్షుఁడు వేఱు. ఈ శ్రీహర్షుఁడు వేఱు. ఈ విషయము గ్రంథశైలియే నిరూపించుచున్నది. ఈతని కృతులు ఖండనఖండఖాద్యము, గౌడోర్వీశకుల ప్రశస్తి, విజయ ప్రశస్తి, ఛందః ప్రశస్తి, శివశక్తిసిద్ధి, నవసాహసాంకచరిత చంపువు మున్నగునవి. హర్షనైషధమున కిరువదిముగ్గురు వ్యాఖ్యాతలు. అందు మల్లినాథ నారాయణ వ్యాఖ్యలే ముఖ్యములు. మిగిలిన వారిలో శ్రీనాథ కవిసార్వభౌముఁడు గూడ నొకఁ డను వాదము గలదు.

ఈ మహాకవి గౌడదేశీయుఁడు గావుననే గౌడోర్వీశ కుల ప్రశస్తి రచించెనని కొందఱ వాదము. ఈతని కవితా ధార యనర్గళము. విద్వదౌషధమగు నైషధ మిరువదిరెండు సర్గల మహాకావ్యము. ఇందలి శైలి మిగుల కఠినముగాని కావ్యము రసవంతము. పదునేడవ సర్గలో నీ కవి తన సర్వ శాస్త్ర పరిజ్ఞానము బ్రకటిత మొనర్చెను. ఇందు బ్రధాన రసము శృంగారము. అదియు శృతిమించి రాగమునఁ బడిన దని కొందఱ మతము. కథాసందర్భమున కనువుగ నక్క డక్కడ తక్కుఁగల రసములు పోషింపఁబడినవి. దశమ సర్గాంత శ్లోకమువలన నీ కవి తర్కశాస్త్ర నిష్ణాత యైనట్లు గోచరించుచున్నది. ఆసేతు శీతనగము నీ కావ్యము సంస్కృత విద్యార్థిలోకమున మిగులఁ బ్రసిద్ధి గన్నది. ఈ కవి శివభక్తి తత్పరుఁడు.

# 13. మాతృగుప్తుఁడు

సాత్త్వికమూర్తి యగు నిక్కవి సచ్ఛీలుఁడు. ఇతఁడు కవిరాజగుటయే కాక రాజకవిగూడ. ఈతని చరిత్ర మతి విచిత్రముగ నుండును. రాజతరంగిణి యను గ్రంథమునుబట్టి యీతని గుఱించి యీ క్రింది విషయములు తెలియనగుచున్నవి.

గోనందవంశమునఁ బ్రవరసేనుఁ డను రాజు గలఁడు. ఆతనికిఁ దుంజీనుఁడను నామాంతరము గలదు. ఇతని జ్యేష్ఠపుత్రుఁడు హిరణ్యసేనుఁడు. ఈతఁడు తన తమ్ముఁడగు తోరమాణునిఁ గారాగార బద్ధునిఁ జేసెను. కాని యన్నదమ్ము లిరువురు నించుమించు నొక్కమారే మృత్యుముఖమునఁ బడిరి. తోరమాణుని పుత్రుఁడు ద్వితీయ ప్రవరసేనుఁడు. ఈతఁడు స్వదేశము వీడి తీర్థయాత్రలకు బయలుదేరెను. ఆకాలమునఁ గాశ్మీర మరాజకమై మంత్రులు పాలించుచుండిరి. కాశ్మీర ముజ్జయినీ రాజగు శ్రీహర్షుని సామంత రాజ్యము.

శ్రీహర్షుఁడు జగత్ప్రసిద్ధి గాంచిన కవిపోషకుఁడు. పండిత పక్షపాతి. అనుదిన మాతని దర్శనార్థ మనేకులు విద్వాంసు లాతని యాస్థానికి వచ్చుచుండిరి. ఒకనాఁడు మాతృగుప్తుఁడు కూడ రాజదర్శనార్థ మరుగుదెంచెను. ఆతఁ డనుదినమును రాజసభలోనికి వచ్చి యూరక కూరుచుండి పోవుచుండెను. అంతయేకాని తన మనోరథమును రాజున కెఱిఁగింపఁడయ్యెను. విద్వద్గోష్ఠులం దీపణ్మాత్రము

పాల్గొనకుండెను. మూకీభావము వహించియున్న యా పండితుని రాజు సహితము 'వీనితో మన కేల ?' యని పలుకరింపకుండెను. ఇట్లీ మూఁగనోము దాదాపొక సంవత్సర కాలము గడచెను.

ఇట్లుండ శీతకాల మరుదెంచెను. ఒకనాఁటి యర్ధ రాత్రమున రాజ ప్రాసాదమునందలి దీపము లన్నియుఁ బెద్ద గాలికిఁ గొండెక్కెను. అంత శ్రీహర్షుఁడు మరల దీపముల వెలిగింపఁ జేయఁదలఁచి 'యెవ రక్కడ' యని పరిచారకులఁ బిలిచెను. పరిజను లందఱు మైమఱచి నిదురించు చుండిరి. కాని ద్వారముకడ వేచియున్న మాతృగుప్తుఁడు 'తాను న్నా'నని చెప్పి రాజానుమతమునఁ బైయంతస్తునకుఁబోయి దీపముల వెలిగించి మరలి పోవుచుండెను. హర్షుఁ డీతఁ డెవఁడో నూతన పురుషుఁ డని కనిపెట్టి 'యాఁగు' మనెను. మాతృగుప్తుఁ డేమి కొంప మునుఁగునో యని భయకంపిత గాత్రుఁడై యట నిలఁబడెను. రాజు 'రాత్రి యింకను నెంత శేషించియున్న'దని యడిగెను. మాతృగుప్తుఁ 'డొకటిన్నర యామ మున్న'దనెను. అంత రాజు 'నీ కెట్లు దెలిసినది ? నీవు నిదురింపలేదా?' యని యడిగెను. మాతృగుప్తుఁ డిదియ యదనని యెంచి తన దీనావస్థను శ్లోకరూపమున వెలిబుచ్చెను.

శ్రీహర్షుఁ డీతఁడు మాతృగుప్తుఁడని గుర్తించి గుండె నీరై యట్టి పండితు నుపేక్షించుట పొరపాటని యెంచి పశ్చాత్తప్త హృదయుఁ డయ్యెను. అతని కేదేని యుపకృతి నొనర్పఁదలఁచి యొక లేఖ వ్రాసి యిచ్చెను. అం 'దీకమ్మఁ

దెచ్చిన వానినిఁ గాశ్మీర సింహాసనాసీను నొనర్పుఁ' డని వ్రాసెను. దీనిని మధ్యేమార్గమున విప్పి చూడకుండ కాశ్మీర దేశపు మంత్రుల కిమ్మని యాజ్ఞాపించెను.

మాతృగుప్తుఁడు తత్క్షణమే బయలుదేరి శ్రీనగరము జేరెను. శ్రీహర్షుని వార్తాహరుఁడ నని చెప్పి యాలేఖ మంత్రుల కందించెను. వారును లేఖాంశములఁ జూచి భయ వినయ సంభ్రమములు ముప్పిరిఁగొన నాతని సత్కరించి పట్టాభిషేక మొనరించిరి. మాతృగుప్తుఁడు తన కృతజ్ఞతను లేఖద్వారమున శ్రీహర్షుని కెఱిఁగించి కాశ్మీర రాజ్యమునుఁ బ్రజారంజకముగఁ బాలించు చుండెను.

ద్వితీయ ప్రవరసేనుఁ డత్యంత దీక్షతో శివు నారా ధించి వరములఁ బొంది సైన్య సన్నాహ మొనరించుకొని విజయయాత్రకు బయలుదేరెను. పెక్కు రాజ్యముల జయించి తుదకుఁ గాశ్మీరముపై దండయాత్రకు వచ్చెను. మాతృగుప్తుఁ డిది విని నిరాశాహతుఁడై రాజ్యమును బరిత్య జించి కాశీయాత్రకు బయలుదేరెను. కాని ప్రవరసేనుఁడుఁ బ్రజారంజకముగఁ బరిపాలించు మీ కీ రాజ్యసన్న్యాస మేల ? కాశీయాత్ర యేల ? మీరే పరిపాలింపుఁ డని ప్రార్థించెను. కాని మాతృగుప్తుఁ డీ ప్రార్థనావచనములఁ జెడచెవినిఁ బెట్టి సన్న్యాసమే కర్తవ్యమను తన మనోనిశ్చయమును బ్రవరసేనున కెఱిఁగించెను. తుదకుఁ బ్రవరసేనుఁడే కాశ్మీర సింహాసన మధిష్ఠించెను. ఇట్లు మాతృగుప్తుఁ డాఱు సంవత్సరములు ప్రజారంజకముగఁ బరిపాలన మొనరించి కవిపోషకుఁడును బండిత పక్షపాతియు నని ప్రసిద్ధిఁ గాంచెను.

ప్రవరసేనుఁడు సేతుబంధ మనెడి ప్రాకృత కావ్యము రచించెను. దీనికే రావణవధ యను నామాంతరము గలదు. ఈమాతృగుప్తుఁడే కాళిదాసని కొందఱ మతము. కాని యీ మాట విశ్వసనీయము కాదు. అందుకుఁ దగిన ప్రమాణములును లేవు. లాక్షణికులు మాతృగుప్తునివని యుదాహరించెడి శ్లోకములయందుఁ గాళిదాసున దొక్క టియుఁ గానరాదు.

మాతృగుప్తుఁ డంతర్వేదినుండి కాశ్మీరమునకు వచ్చి నట్లు కొందఱు చెప్పుచున్నారు. మఱియొక మాతృగుప్తుఁ డట్టు లొనరించెనేమో కాని యిదియు సందిగ్ధమే. ఈ యంతర్వేది గంగా యమునా నదుల మధ్యప్రదేశమని కొందఱును, గోదావరీమండలమున గౌతమీ సాగర సంగమ ప్రదేశమని మఱికొందఱునుఁ జెప్పుచున్నారు.

ఇతఁడు భరతనాట్యశాస్త్రమునకు వ్యాఖ్యానము రచించెనని సుందరమిశ్రుఁడు జెప్పియున్నాఁడు. సంగీత రత్నాకరమునఁ బ్రసిద్ధపూర్వ సంగీతశాస్త్రజ్ఞులలో నీతని పేరుకూడ గలదు. కాన నితఁడు సాహిత్యమునందే కాక సంగీతమునందును బ్రవీణుఁ డని చెప్పవచ్చును.

# 14. అమరుకుఁడు

అదృష్టవంతులగు కవులలో నమరుకకవి యొకఁడు. పరశ్శతంబులగు గ్రంథములు రచించిన కవులకుఁ గూడఁ జేఁజిక్కని యశ మొక్క శృంగార శతక రచనమున నీతనికి లభ్యమైనది. ఈ శతకరాజము కొమ్ములు దిరిగిన కవి రాజులచే నుతిఁగన్నది. చరిత్రాధారములు లేనికతమున నితర పూర్వకవుల వానివలె నీ కవి కాలాదులుగూడ సందిగ్ధములు. ఇతర పూర్వకవులకువలె నీకవిచంద్రునకుఁ గూడ కట్టుకథ యొకటి యంటఁగట్టఁబడినది. జగద్గురు శ్రీ శంకరాచార్యులవారికిని నీతనికిని సంబంధించిన దా కథ. మాధవాచార్య విరచిత శంకరవిజయ మను గ్రంథమున నా కథ గలదు.

శంకరాచార్యుల చరిత్ర సందర్భమున నాతనికిని మండనమిశ్ర పండితునకును వాదము సంభవిల్లెనని చదివితిమి కదా! మండనమిశ్రుఁడు పరాజితుఁడైన పిమ్మట నాతని యర్ధాంగి యుదయభారతి తాను మండనమిశ్రుని యర్ధదేహము ననియు మండనమిశ్రు నోటమితో శంకరున కర్ధ విజయమే లభించె ననియుఁ దననుఁగూడ నోడించినఁగాని పూర్తి విజయము లభించినట్లు గాదనియు చెప్పి యాతనితో శాస్త్రచర్చకుఁ గడంగెను. ఏ శాస్త్రమునందును శంకరుని వాదమునకుఁ బ్రతివాద మొసంగలేక యొక యుపాయ మాలోచించెను. శంకరుఁ డస్ఖలిత బ్రహ్మచారి. ఆయన వాత్స్యాయన సూత్రవాసన యెఱుఁగఁడు. కాన కామ

శాస్త్రమునం దోడింతమని యందలి ప్రసంగమునకు దింపెను. శంకరుఁ డొక్క మాసము దినములు గడువడిగి తీసికొని శిష్యసమేతుఁడై నర్మదాతీరారణ్యమున కేఁగెను. అట దేహమును త్యజించి తాను తరిగి వచ్చి ప్రవేశించు దనుకఁ దన కళేబరమునుఁ గాపాడుచుండుమని దాని నొక వృక్ష కోటరమున నిక్షిప్త మొనరించి వెడలిపోయెను. అదే సమయమున నా దేశపాలకుఁ డగు నమరుకుఁడు మరణించెను.

శంకరుఁ డాతని మృతకళేబరమునఁ బ్రవేశించెను. కాని యమాత్యు లాతని నడవడివలన నెవరో మహాత్ముఁడు తన కళేబరమును వీడి రాజకళేబరమునఁ బ్రవేశించె నని గ్రహించిరి. ఆ కళేబరము నన్వేషించి దగ్ధ మొనరింపుఁ డని గూఢచారుల నియమించిరి. శంకరుఁ డమరుకుని భార్యవలన నిష్టోప భోగము లనుభవించుచు నామెయే కామశాస్త్రోపా ధ్యాయినిగ వాత్స్యాయన సూత్ర భాష్యము నెల్ల గ్రహించెను. తదనుగుణముగ శృంగార శతక మను గ్రంథ మమరు కుని పేరట రచించెను.

తదనంతరము శంకరుని శిష్యులు గుర్వన్వేషణ మొనర్చుచు వచ్చి రాజద్వారము నెదుట నాతఁడు గ్రహించు నట్లు వేదాంత శ్లోకముల వల్లెవేయుచుండిరి. శంకరుఁడు పూర్వవృత్తాంతము స్ఫురింపకువచ్చి తన దేహమును బ్రవే శించుటకై వెడలెను. ఈ లోపలనే గూఢచారు లాతని కళేబరమును వెదకి తెచ్చి చితిపై కెక్కించి నిప్పంటించిరి. కాలుసేతులు సగమువఱకుఁ గాలిపోయెను. శంకరుఁడు 'లక్ష్మీనృసింహ మమ దేహి కరావలంబ'మ్మని యిష్టదేవతా

స్తుతి యొనరించి శరీరస్వాస్థ్యముఁ గాంచెను. పిమ్మట నుదయభారతి నోడించి యఖండ యశము నార్జించెను.

ఈకథ కల్పితమే యయ్యును, శంకరామరుకులు సమకాలికు లనియు, శంకరుఁడు పరకాయప్రవేశ సామర్థ్యము గల దేవాంశసంభూతుఁ డనియు మనకుఁ దెలుపుచున్నది. ఈశృంగారశతక కర్త శంకరుఁ డైనను నమరుకుఁ డైనను నిది సమస్త పండితాదరమును బడయఁగల్గినది. సాహిత్య లక్షణ గ్రంథకర్త లందఱు నిందలి శ్లోకము లుదాహరణ లుగఁ దీసికొనిరి.

ఈ శృంగార శతకమునకు, వేమభూపాలుఁడు రవి చంద్రుఁడు మున్నగు పండితోత్తములు, విద్వద్రంజకములగు టీకలు రచించిరి. ఈ చిన్న గ్రంథ మొక్కటియే కావ్య లోకమున నమరుకునకు శాశ్వతయశము నార్జించి పెట్టెను.

# 15. రాజశేఖరుఁడు

రాజశేఖరకవి చేదిమండల నివాసి. ఈతని పూర్వికు లందఱు పండితకవులు. ఇతని తలిదండ్రులు శీలవతీదుర్దుక పండితులు. దుర్దుక పండితునకు దుహికుఁ డను నామాంతరము గలదు. ఇతఁడు మహోదయనగర పాలకుఁ డగు మహేంద్రపాలునకు మంత్రి, గురువు. ఆతని కుమారుఁ డగు మహీపాలదేవునకు మన రాజశేఖరకవియే గురువు.

రాజశేఖరకవికి బాలకవి యనియు, కవిరా జనియు, నుపాధ్యాయుఁ డనియు బిరుదత్రయము గలదు. మహేంద్రపాలుఁడు నాతని కుమారుఁడు మహీపాలదేవుఁడు వ్రాయించిన శాసనములఁబట్టి యీతఁడు క్రీ. శ. 10 వ శతాబ్ది వాఁడని తెలుచున్నది. ఈ కవివతంసుని భార్య యవంతి సుందరి. ఈమె క్షత్రియస్త్రీ.

అందువలన నీ కవి క్షత్రియుఁడై యుండునని కొందఱు విమర్శకు లభిప్రాయపడి యుండిరి. కాని యీతని పూర్వికులలో నెవఁడో యాయావరవృత్తిచే జీవించె ననియు నది కారణముగ నీతని వంశము యాయావరవంశ మని ప్రసిద్ధి కెక్కె ననియు క్షత్రియులవృత్తి యాయావరము కాదు గాన నీతఁడు క్షత్రియుఁడుగాఁడనియు మఱికొందఱ యభిప్రాయము. ఆ కాలమున ననులోమ వివాహము లాచారమునం దుండెను. కాన నీతఁడు క్షత్రియ కన్యను వివాహమాడిన బ్రాహ్మణుఁడై యుండవచ్చు నని యింకఁ గొందఱ యభిప్రాయము.

ఈతనిది యాయావర వంశమని చెప్పియుంటిమి గదా! ఈతఁ డొక శ్లోకమున సజీవుఁడగు లోభియు శవము వలెనే దానము చేయఁజాలఁడు, కాని కండరమాంసములఁ బెంచి కాకుల కుపకారము చేయుచున్నాఁడని చెప్పెను. దీనినిఁబట్టి యీతఁ డనేకులు దాతల నాశ్రయించి వారితోఁ బ్రాణము విసిగి తుదకు యాయావరవృత్తి నవలంబించె నని తెలియుచున్నది. కావున నీతని కాలముననే యీతని వంశము యాయావరవంశ మని ప్రసిద్ధికెక్కి యుండు ననుట గూడ నూహా కెడమైన విషయము గాదు.

చంద్రవర్ణనమున నీ కవి యందెవేసిన చేయి. ఒకా నొక శ్లోకమునఁ జంద్రు నపుడే దంతధావన మొనరించు కొనిన దాక్షిణాత్య కాంతల దంతములవలె ధవళముగ నున్నాఁ డని యుపమించి యున్నాఁడు. మఱియొక శ్లోకమున వివిధ దేశ స్త్రీలను వర్ణించి యున్నాఁడు. దీనినిఁ బట్టి యీ కవి యౌవనమున విషయలంపటుఁడుగ నుండెననియు వార్ధక్యమున విరాగియై సత్కవి రాజశేఖరుఁ డయ్యె ననియు నూహింపవచ్చును. ఈతని శైలి మృదుపదగుంఫితము. ధార యనర్గళము.

# 16. శూద్రకుఁడు

శూద్రకుఁ డొక గొప్ప రాజకవి యగుటయే కాక కవిరాజు గూడ. ఈ యుత్తమ రాజకవి జీవితము పెక్కుర విద్వాంసులచేఁ గథావస్తువుగ గ్రహింపఁబడినది. పెక్కుర విమర్శకాగ్రేసరులచే విమర్శింపఁబడినది. పూర్వకవులు గొంద ఱితని నాయకునిగ నొనర్చి కావ్యములు నిర్మించిరి. ఈ విషయములే యీతని గొప్పతనమునకుఁ బ్రబల తార్కాణములు.

రామిలుఁడు సోమిలుఁడు నను కవులు శూద్రకుని జీవితమును గథగ రచించిరి. పంచశిఖుఁ డను ప్రాకృత కవి వైక్రాంతశూద్రక మను కావ్యమును రచించెను. ఈ కబ్బమునకును గథావస్తువు శూద్రకరాజు జీవితమే. అనంతుఁ డను కవి వీరచరిత మను గ్రంథమున శూద్రకుని గూర్చి యీ క్రింది విషయములు వెలువరించెను.

శూద్రకుఁడు బ్రాహ్మణ వంశ సంజాతుఁడు. శాలివాహనుఁ డను రాజునకును నీతనికినిఁ బరమమైత్రి యుండెడిది. శూద్రకుఁడు విక్రమాదిత్యు నోడించి యుజ్జయినీ పట్టణమునకు రాజయ్యెను. ఈ వీరకృత్యమున శాలివాహనుఁ డితనికి సహాయపడెను.

ఇట్టి కృత్యము లితని యవక్రపరాక్రమమును నద్భుత శౌర్యమును బ్రకటించుచున్నవి. ఈతని వీరగాథను ననేకులు విద్వాంసు లనేక రీతుల వర్ణించిరి. ఇంకను ననేక యుద్ధగ్రంథము లనేక విధముల నీతని గాథను వివరించెను.

కాదంబరి యను గ్రంథమున శూద్రకుఁడు విదిశాపురమునుఁ బరిపాలించె నని వర్ణింపఁబడి యున్నది. కథాసరిత్సాగరమున నీతఁడు శోభావతీ పట్టణ పరిపాలకుఁ డని వర్ణింపఁబడి యున్నది. భేతాలవింశతి యను నుద్గ్రంథమున నీతఁడు వర్ధమాన పురాధిపతి యని యాగ్రంథకర్త వివరించెను. హర్షచరిత్ర యందుఁ జంద్రకేతువునకును శూద్రకునకును బద్ధవైర ముండె నని చెప్పఁబడినది. రాజతరంగిణి యను గ్రంథరాజమున నీతఁ డొక మేరుసమానధీరుఁ డని వర్ణింపఁ బడి యున్నది.

పూర్వకవులే యీ కవి విషయమున నిట్టి యభిప్రాయ వైవిధ్యము గలిగియుండ నీతని దేశకాలాదులను గుఱించి యిదమిత్థమని మన మెట్లు నిర్ణయింపఁ గలము ? కావుటం బట్టియే యాధునిక విమర్శకు లీతఁడు బ్రాహ్మణుఁడో, క్షత్రియుఁడో నిర్ణయింపఁజాల కున్నారు. కావున వివిధ విద్వాంసు లొసంగిన వివిధాభిప్రాయములఁ గ్రోడీకరించుట గ్రంథముఁ బెంచ నెంచుటయే యగును. దానివలనఁ బ్రయోజన మిసు మంతయు లేదు. అందువలన నాచర్చ యింతటితో ముగిం చుట సమంజసము.

శూద్రకుఁడు మృచ్ఛకటిక మను ప్రకరణము రచిం చెను. ఇందుఁ బదియంకములు గలవు. కొందఱు విమర్శకులు దీని కర్తృత్వమును దండి కంటఁగట్టిరి. ఈ రూపక ప్రస్తావన యందు సూత్రధారుఁడు శూద్రకునిఁగూర్చి యిట్లు వచించెను. "సుందరాకారుఁడును ద్విజాతి సంజాతుఁడును, ఋగ్వేద పారంగతుఁడును, నపరిమిత సత్త్వుఁడును, భగవదనుగ్రహ

మున జ్ఞాననేత్రము వికసించినవాఁడును నగు శూద్రకుఁడు కుమారునకు రాజ్యమిచ్చి నూఱేండ్లకుఁబైనఁ బదిదినములు జీవించి యగ్నిప్రవేశ మొనర్చెను." తన యాయుఃపరిమాణ మును జాతకమువలనఁ దెలిసికొని తరువాతఁ దానొనర్పఁ బోవు నగ్నిప్రవేశమును సూత్రధార ముఖమున వెలిబుచ్చె నని యొక వ్యాఖ్యాత వాక్రుచ్చెను. అందువలన నీకావ్య మును శూద్రకుఁడే రచించి యుండునని దృఢీకరించెను.

శూద్రకుఁడు మేరుసమాన ధీరుఁడు. వేదవేదాంగ పారంగతుఁడు. శివభక్తి తత్పరుఁడు. గొప్పజ్ఞాని. యోగాగ్ని యందు దేహత్యాగ మొనర్చిన విరాగి. కాన శరభంగ తుల్యుఁడు. మీఁదుమిక్కిలి తపోనిధి. మత్తేభముల డీకొనఁ జాలు మహాబలశాలి. యుద్ధమనిన నీతనికిఁ గడు ప్రీతి.

శూద్రకరచితమగు మృచ్ఛకటికము రూపక ప్రపంచ మున నద్వితీయము. భాసవిరచితమగు చారుదత్తమున కిది యనుసరణమే కాని కథాకల్పనము దానికన్న మనో హరతరము. చారుదత్తుఁ డీ రూపకమున నాయకుఁడు. వసంతసేన నాయిక. నాయక లక్షణములం బట్టి యీ నాయ కుఁడు ధీరశాంతుఁడు. నాయిక రోవెలఁది యైనను నుత్తమశీల. వేశ్యలకు సహజమగు ధనాసక్తి యీమెకడ లేదు. ఈపె సద్గుణఖని. పాత్రౌచిత్యమునకుఁ బుట్టినిల్లగు నీ రూపకము ప్రదర్శన యోగ్యమై సామాజిక హృదయముల నాకర్షించును. కథాకల్పనము నందును రసోత్కర్ష యందును నీ దృశ్యకావ్య మనితర సామాన్యము. సాంఘిక నాటకములం దెద్దియు దీనితో సరితూగ లేదు.

మృచ్ఛకటిక శైలి మృదుపద గుంఫితము. ధార యనర్గళము. భావము లసామాన్యములు. చతుష్షష్టి కళల యం దొక్కటి యగు చౌర్యకళ యిందు సువిదిత మొనర్పఁ బడెను. కనకశక్తి, కన్నము వేయు నుపాయము, మున్నగు చౌర్య సూత్రము లిందు వర్ణితములు.

ఈ కవి చారుదత్తము నందలి యభిమానముచే దాని నెన్నో సారులు పఠించి హృద్గత మొనరించుకొనెను గాన నందలి భావములును బదములును నిందు దొరలెను గాని, యిది గ్రుడ్డి యనుకరణ గాదు. కొంద అనుకొనిన యట్లు లిందు గ్రంథచౌర్య మావంతయు లేదు.

# 17. భోజుఁడు

'అద్యధరా నిరాధారా' యను నానుడి గల ధారా నగర పరిపాలకుఁ డీ భోజుఁడు. భోజుని యనంతరము కాళిదాస మహాకవి ధారానగరమును గూర్చి వచించిన దీ వాక్యము. భోజుని గూర్చియు, కాళిదాస మహాకవిని గూర్చియు నిట్టి కట్టుకథ లనేకములు గలవు. ఏది యెట్లైనను భోజుఁడు విశాల సామ్రాజ్యమునే కాక కవితాసామ్రాజ్య మునుగూడఁ బరిపాలించె నను మాట మాత్రము వాస్తవము.

భోజుఁడు పండిత ప్రకాండుఁడే కాక పండిత పోషకుఁడు. ఈతని యాస్థానమునఁ బెక్కు రు పండితు లుండెడివా రనియు ననవరత పండితగోష్ఠియే యీతని యాస్థాన విశిష్టత యనియుఁ బ్రతీతి గలదు. అందువలననే యాంధ్రభాషా పోషకుఁడును బండిత పక్షపాతియు నగు మన కృష్ణదేవరాయల కాంధ్రభోజుఁ డను బిరుదు.

భోజుని ముఖావలోకన మాత్రమున నెట్టివానికిని గవిత్వ మబ్బునను నొక లోకోక్తి గలదు. ఒకానొక పండితు నకు గృహావసతి గల్పింపఁ దలఁచి యొక తంతుకారుని గృహమునుండి వెడలనడిపి రనియు నాతఁడు భోజుని కడ మొఱయిడఁ బోవ నాతనికినిఁ గవిత్వ మబ్బి యాశువుగ జెప్పె ననియునొకకథ గలదు. ఆకథమీకు సుపరిచితమనుకొందును.

భోజుఁడు శ్రీహర్షుని మనుమఁడు. సింధురాజ దేవుని పుత్రుఁడు. ముంజుని తమ్ముని కుమారుఁడు. ముంజుఁడే భోజుని సింహాసనాధిష్ఠితుఁ జేసె నందురు. భోజుని పట్టాభిషేక మహోత్సవము శా. 918 వ సంవత్సరము జరిగెనని శాసన

దృష్టాంతము గలదు. ఈతఁడు శా. 918–73 వఱకు విదర్భ నేలె ననియుఁ బెక్కుర పండితవరేణ్యులకును గవి సింహములకును దానము లొసంగుటయే కాక కవితా సామ్రాజ్యము గూడ నవిచ్ఛిన్నముగఁ బరిపాలించె ననియు శాసనములు గలవు. అయినను నీతని పరిపాలనా కాలమును గూర్చి మతభేదము లనంతములు గలవు. ఈతఁడు రాజరాజనరేంద్రుని సమకాలికుఁ డనియు, రాజమహేంద్రనగరమున నన్నయ భారతాంధ్రీకరణ మొనర్చు కాలముననే ధారానగరమున భోజుఁడు సరస్వతీ కంఠాభరణమును రచించుచుండె ననియుఁగూడ కొందఱి మతము.

భోజుని దానశాసనములఁ బట్టి యాతఁడు విశాల సామ్రాజ్యాధినేత యైనను రాజ్యాధికార మదోన్మత్తుఁడు గాఁడనియు నైహికసుఖాభిలాషి గాఁడనియు గ్రహింప నను వగుచున్నది.

ఈతఁడు వేదప్రమాణము గల శివభక్తి తత్పరుఁ డయ్యును జైన బౌద్ధ పండితులను గూడ సత్కరించెను గాన పరమతసహనము గలవాఁ డని నొక్కి వక్కాణింపవచ్చును.

భోజుని సాహిత్య గ్రంథములలో రామాయణచంపు వగ్రగణ్యము. దీనిని సర్వసాధారణముగ భోజుని చంపు వనియే వ్యవహరింతురు. ఇది యీతఁడు నిర్మించినది కాదను మతభేదము గూడ గలదు. సంస్కృత చంపువు లన్నిటికన్న నెక్కుడు పండితామోదమును బొందఁజాలిన దీ చంపువే. వాల్మీకికృత రామాయణ మీప్రబంధరాజమునకు మూలము. దీని శైలి మిగుల గంభీరమై రాజఠీవి యుట్టిపడుచున్నది.

కవికిఁగల వైదికాచారపరాయణత యిందు సుస్పష్టముగఁ గన్పట్టును. విప్రులు ధర్మాచరణాసక్తులుగ నుండవలె ననియు వేదాధ్యయనము నేమఱగూడ దనియు భోజుఁ డిందు శాసించెను. ఈతఁడు సుందరాకాండము తుదివఱకు మాత్రమే రచించెనో, రచించిన శిథిలమయ్యెనో కాని యుద్ధకాండమును లక్ష్మణసూరి యను విద్వాంసుఁడు పూరించెను.

మహారాష్ట్రుఁడగు లక్ష్మణసూరి గంగాధరునకును నాగాంబికకును జన్మించెను. ఈతని నివాసము భాగానగరము. తంజావూరులోని ఘనశ్యామునకుఁ బూర్వ మీతఁడుండెను. ఈ పండిత ప్రకాండుఁడు మఱియొక యుద్ధకాండమును రచించుటయేకాక లక్ష్మణసూరి యుద్ధకాండమునకు వ్యాఖ్యాతయు నయ్యెను. ఈ వ్యాఖ్యాన మముద్రితము. ఈతఁడుకాక యీ చంపువునకు మఱికొందఱు వ్యాఖ్యాతలు గలరు. అందు నారాయణ పండితుఁడు రామచంద్రుఁడు నను నిరువురాంధ్రులు కూడ గలరు. ఉత్తరకాండను బెక్కురు కవు లుత్తర చంపువుగ రచించిరి. ఇట్లు భోజచంపు వనఁబడు రామాయణ చంపువు పండితాదరపాత్రమై మిగుల వన్నె కెక్కెను.

సాహిత్య లక్షణ గ్రంథములగు శృంగార ప్రకాశము సరస్వతీ కంఠాభరణము గూడ నీ కవి నిర్మించెను. శృంగార ప్రకాశము మిగుల గొప్ప గ్రంథము. అందు ముప్పదియాఱు ప్రకాశములు గలవు. ఈ యుత్తమ కృతి యనేక విద్వాంసుల మన్నన లందఁజాలెను. ఇందు కావ్యరూపకాది భేదములును, వ్యాకృతి విశేషములును, రస విచారమును

విపులముగఁ జర్చింపఁబడినవి. భవభూతి 'ఏకోరస కరుణ ఏవ' యని వచియింపగా భోజుఁ డిందు 'శృంగార ఏక ఏవ రసః' యని సిద్ధాంతీకరించెను. శృంగారమే రసముగాని తక్కినవి రసములు గావని యీ కవి తన యభిప్రాయము నిందు వెల్లడించెను.

సరస్వతీకంఠాభరణమునం దైదు పరిచ్ఛేదములు గలవు. ఈ గ్రంథమున కీనామము సార్థకమని యెల్లరు నంగీకరించిన విషయమే. వాక్య వాక్యార్థ దోషములును, రసములును భావములును నిందు యుక్తియుక్తముగఁ జర్చింపఁబడినవి. తరువాతి లాక్షణికు లెల్లరు నీ గ్రంథమును బ్రమాణముగ స్వీకరించిరి. ఈ యుద్గ్రంథము సమకాలి కాదరణమునుఁ బొందఁజాలెను గాని తరువాత తరువాత దీని ప్రశస్తి తగ్గినది. ఇందుఁ బూర్వకవుల శ్లోకము లెన్నియో యుదాహృతములు.

రాజమార్తాండము, పాతంజల యోగసూత్ర వృత్తి, కరుణామృగాంకము, శృంగారమంజరి, విద్యావినోదము, శివతత్త్వరత్న కళిక, సుభాషితము, సంగీతప్రకాశము మున్నగు పెక్కు కృతు లీతఁడు రచించినట్లు చెప్పఁబడుచున్నది.

ఇట్టు లిట్టి యుత్తమకీర్తి నార్జించిన సార్వభౌముఁడును, గవిసార్వభౌముఁడును, మన భరతఖండమున నింకొకఁ డుండియుండఁ డని చెప్పవచ్చును. భోజుఁడు భగవదంశ సంభూతుఁడని సమకాలికాభిప్రాయము. అందువలననే యీతనిఁ గూర్చి భోజప్రబంధము, భోజచరిత్రము మున్నగు పెక్కు కృతులు రచింపఁబడినవి.

# 18. బిల్హణుఁడు

ఈ కవివతంసునిఁ గూర్చి దక్షిణ హిందూస్థానమున నీ క్రింది కల్పిత కథ ప్రచారమున గలదు.

బిల్హణుఁడు నవయౌవన రూప విలసితుఁడు. పండిత వరేణ్యుఁడు. రసికాగ్రేసరుఁడు. ఈతఁడు యామినీపూర్ణ తిలక యను రాచకన్నెకు విద్య గఱపవలసి వచ్చెను. ఆ కన్నెయు నందాల బరణి. నూత్నయౌవన విలసిత. ఈ పె తలిదండ్రులు తమ కుమార్తెకు శీలభంగ మగునేమో యని యనుమానించిరి. గురువు జన్మాంధుఁ డని శిష్యురాలికిని, నాపె కుష్ఠవ్యాధిపీడిత యని గురువునకును జెప్పిరి. అన్యోన్య ముఖావలోకనము లేకుండున ట్లిరువురకును మధ్య నొక తెఱ నేర్పాటొనరించిరి. ఇట్లు విద్యాభ్యాస మంతయుఁ దెఱ చాటుననే జరుగుచుండెను. కతిపయదినముల కొకనాటి రాత్రి బిల్హణుఁడు పూర్ణచంద్రు నాలోకించుచు దన యసమాన కవితా మాధుర్యమున నాతని వర్ణించుచుండెను. ఈ వర్ణన యామినీపూర్ణ తిలకకుఁ గర్ణగోచర మయ్యెను. ఆపె 'పుట్టుగ్రుడ్డి యేడ? చంద్రవర్ణన మేడ?'నని సందేహించి తెఱఁ దొలఁగించి చూచెను. నవమన్మథాకారుఁ డగు బిల్హణుఁ డగుపడెను. ఆతఁడును యామినీపూర్ణతిలక నిరుపమాన సౌందర్యమును గాంచి యాశ్చర్య చకిత మానసుఁ డయ్యెను. తత్క్షణ మొండొరులు ప్రేమపాశ బద్ధులైరి. ఆ ప్రేమ కతమున నిరువురును దదుపరి నష్టకష్టముల

గుడువవలసి వచ్చెను. ఇందలి సత్యాసత్యము లెటులున్నను గథకు కాళ్ళులేవు, ముంతకుఁ జెవులు లేవను ట్టిదియే.

ఇక నుత్తర హిందూస్థానమున నీ కవినిఁ బట్టుకొన్న గాథ నారయుదుడు.

ఉత్తరహిందూదేశమున ఘూర్జర మను నొక రాష్ట్రము గలదు. ఒకానొకప్పు డది వైరిసింహుఁ డను రాజు పరిపాలనక్రింద నుండెను. ఆతనికి శశికల యను కుమార్తె గలదు. ఆపెయు సౌందర్యరాశి కాన నా నామ మామెకు సార్థకమయ్యెను. మన కవివరేణ్యుఁ డీ కన్నెనుఁ గామించెను. భూపాలుఁ డీ సంగతి నెఱింగి కవికి శూలారోపణశిక్ష విధించెను. ప్రేమపాశబద్ధుఁ డగు బిల్హణుఁడు శూలాగ్రమున నుండియు 'అద్యాపితాం కనక చంపక దామగౌరీ' మని యా రాజకన్యనే స్మరించుచు తన యగాధ ప్రేమను వెల్లడించెను. ఇట్లు శూలాగ్రమమున నుండియే బిల్హణ కవీంద్రుఁ డేబది శ్లోకము లాశువుగ మిగుల మృదు మధురముగఁ జెప్పెను. రా జది విని కవిని శూలవిముక్తుఁ గావించి సుతనిచ్చి పరిణయము గావించెను. ఉత్తర దక్షిణ దేశ గాథలందుఁ బ్రధానాంశ మొకటియే కాని రెండును కాకమ్మ కథలే. మన దేశమున నితర కవుల కంటఁగట్టఁ బడిన కల్పిత కథలవంటివే యీ రెండును.

బిల్హణుఁడు తన విక్రమాంకదేవచరిత మను గ్రంథమున స్వవిషయమును వెల్లడించుకొనెను. చాళుక్యవంశ భూషణుఁడగు నాహవమల్లుని కుమారుఁడైన విక్రమాంక

దేవుని చరిత్రమును గథావస్తువుగఁ గైకొని యాతఁ డొక మహాకావ్యము నిర్మించెను. ఆ కావ్యమువలన నీ క్రింది విషయములు గ్రహింప ననువగుచున్నది.

"కాశ్మీర రాష్ట్రమున బ్రవర మను పురవరము గలదు. దానికిఁ గ్రోశత్రయ దూరమున జయవన మను జనపదము గలదు. దాని చేరువనే ఖోనముఖ మనెడి కుగ్రామము గలదు. ఆ గ్రామమునం దనేకులు బ్రాహ్మణో త్తములు గలరు. వీరందరును గోపాదిత్యుఁ డను కువలయాధి పతి కాలమున మధ్యదేశము నుండి రావింపఁబడిరి. అందు కౌశిక గోత్రులు గలరు. వారు సదాచార సంపన్నులు. వేద వేదాంగ పారంగతులు. అందు ముక్తికలశుఁ డను పండితో త్తముఁ డుండెను. ఆతని పుత్రుఁడు రాజకలశుఁడు. ఆతనికి జ్యేష్ఠకలశుఁ డుదయించెను. జ్యేష్ఠకలశుని భార్య నాగా దేవి. ఈ పూజ్యదంపతుల కిరువురకును నిష్టరామకవి, యానందకవి, బిల్హణకవి యను మువ్వురు పుత్రులు బుట్టిరి. అందు బిల్హణుఁడు బాల్యముననే సంస్కృత మభ్యసించి యచిరకాలమున సకల విద్యాపారంగతుఁ డయ్యెను. కొండొక కాలమున కీ కవికి దేశసంచార కౌతూహలము మెండయ్యెను. అది కారణముగ నాతఁ డుత్తర హిందూ స్థానమునఁ గల పుణ్యక్షేత్రముల నన్నిటి మెట్టి దక్షిణ హిందూస్థానమున కల్యాణచాళుక్యుల రాజధాని యగు కల్యాణపురము జేరెను. ఆ కాలమున నా రాజ్యమును నాహవమల్లుఁడు పరిపాలించు చుండెను. అతఁడే త్రిభు వనమల్ల బిరుదాంకితుఁడు. ఈ రాజోత్తముఁడు బిల్హణునకు

ధనకనకవస్తువాహనాది సత్కారము లొసంగి విద్యాపతి యను బిరుదప్రదాన మొనర్చెను."

ఇంకను గొన్ని కావ్యముల వలన నీ కవిని గూర్చి మఱికొన్ని విషయములు గ్రహింప వీలగుచున్నది. ఈతని జన్మకాలము శా. 950 ప్రాంతము. కాశ్మీరదేశము ననంత భూపాలుఁ డేలుచున్నపు డీతఁడు జీవించి యుండెను. తన బాల్యమున నా రాజు నాస్థానకవుల నెఱిఁగి యుండెను. ఈతఁడు స్వదేశమున నుండనొల్లక యణహిలపుర మేఁగి యా రాజుచే సన్మానము లందెను. అనేక దేశము లేఁగి యనేక దేశాధిపతుల మన్నన లందెను. కర్ణరాజు నాస్థానమున కేఁగి యాతని నాయకునిగ నొనర్చి కర్ణసుందరీ నాటిక రచించెను. భోజరాజు కాలమునాటి కీతఁడు దేశసంచారము మొదలిడనందున నాతని నెఱుఁగఁడు. హర్షదేవుఁడు పండితాభిమాని యనియు గవిబాంధవుఁ డనియుఁ గూడ నీతఁడు వినియుండెను. దీర్ఘాయుష్మంతుఁ డగు నీ కవి యెనుబది వత్సరములు జీవించి యుండెను. విక్రమాంకదేవు నాస్థానమున నీ కవి చిరకాలముండి గొప్ప సుఖము లనుభవించెను. కాని యేకారణముననో తుద కాతని యాగ్రహమునకు గుఱియై పెక్కుడుమ లనుభవించెను. ప్రాయశః రాజునకాంతరంగికులగు కొంద ఱసూయాపరు లీతనిపై రాజునకు నూరిపోసి ద్వేషము పురిగొల్పి యుండవచ్చును.

ఈతని విక్రమాంకదేవ చరితమును బట్టియు కర్ణసుందరీనాటికను బట్టియు నీతఁడు గొప్ప విద్వాంసుఁ డనియు నుదాత్త కవిత్వ మీతని సొమ్మనియు దెలియనగును.

ఈ కవికి స్వస్థలాభిమానము మెండు. ఇతఁడు శివభక్తి తత్పరుఁడు. ఇట్టి శివభక్తాగ్రేసరునకే యట్టి వలపు కథలంటఁగట్టఁబడినవి. కథల సత్యాసత్యము లెట్లున్నను నితఁడు యౌవనమున భోగలాలసుఁడైనను వార్ధక్యమున వేదాంతమవలంబించె నని వానివలనఁ దెలియుచున్నది.

# 19. లీలాశుకుఁడు

ఆంధ్ర మాతృశ్రీ కంఠమున నలరారు ముప్పేటల ముత్యాలహారమో యన గౌతమీ కృష్ణా కావేరి యను పవిత్ర నదీత్రయ మలరారుచుండును గదా ! అందు కృష్ణవేణ్ణానది ప్రసిద్ధతరము. ఆ నదీమతల్లి యొడ్డున శ్రీకాకుళమను ప్రసిద్ధ పురవరము గలదు. ఆ నగరరాజమే చిరకాలమాంధ్రుల రాజధానిగ నొప్పారెను. అందొక ప్రసిద్ధ విద్వత్కుటుంబమున బిల్వమంగళుఁడు జనించెను. ఆతఁడు చిన్ననాఁటనే కావ్యనాటకాలంకార సాహితీనిష్ణాతుఁడయ్యెను. పాణినీయ మామూలాగ్ర మభ్యసించెను. అంతియేకాక యువకుఁ డగునప్పటికి గొప్ప కవితల్లజుఁడయ్యెను. ఈ కవియే శ్రీకృష్ణలీలాగానామృతపారవశ్యమునఁ జేసి లీలాశుకుఁ డయ్యెను.

ఈ కవివతంసుఁడు కృష్ణకర్ణామృత మను భక్తిరస గ్రంథమును నిర్మించెను. భక్తలోకమున నయ్యది మిగుల ప్రసిద్ధము. ఈ గ్రంథమునకు కృష్ణకర్ణామృతత్రిశతి యను నామాంతరము గలదు. మొదట బిల్వమంగళులై పిమ్మట లీలాశుకు లను బిరుదనామము గ్రహించిన కవు లిద్దరు ముగ్గురున్నట్లు తోఁచుచున్నది. అందువల్లనే కృష్ణకర్ణామృత కావ్యములు గూడ రెండు మూఁడు గన్పట్టుచున్నవి. వీనియందు గొన్ని శ్లోకములు ప్రక్షిప్తములై కొన్ని లోపించి శ్లోకసంఖ్యయందు భిన్నత్వము గానిపించు చున్నది. ఒక ప్రతియందు 109 శ్లోకములు, మఱియొక దానియందు 112

శ్లోకములును గన్పట్టుచున్నవి. ఇంకొక ప్రతి బిల్వమంగళ స్తోత్ర మను పేర ముద్రితమై యున్నది.

మలబారు రాష్ట్రమున భారతీ నదీతీరమున ముక్తి స్థల మను ప్రదేశమున మఱియొక లీలాశుకుఁడు గలఁడనియు నతఁడు పన్నెండు తరంగముల కృష్ణకర్ణామృతమును రచించె ననియు మఱియొక మతము గలదు. ఏది యెట్లున్నను లీలాశుకునిగూర్చి పెక్కు కథలు దేశము నాలుగు దిశల వ్యాపించి యున్నవి.

ఆంధ్రదేశమున జింతామణీబిల్వమంగళుల కథ యతి పరిచితముగదా! చింతామణి యనునది వేశ్య యని కొంద ఱును, లీలాశుకుఁడు పఠించిన మంత్రరాజమని కొందఱును, చింతామణిని బోలు సోమగిరి యోగీంద్రుఁ డని కొందఱును జెప్పుదురు. ఇట్టి యభిప్రాయ వైవిధ్యమునకు "చింతామణిర్జ యతి సోమగిరి ర్గురుః" అను శ్లోకపాదమే కారణము. కారణ మేదియైనను గవికి వేశ్యాసంపర్క ముండెనని యీక్రింది కథ చాటుచున్నది.

కవి కృష్ణాతీరవాసి యని చెప్పియుంటిమి కదా! కృష్ణ కద్దరినున్న యొక గ్రామమున నొక వారవనిత యుండెను. ఆపె గొప్ప విదుషీమణియే కాక ధనవంతురాలు. బిల్వమంగళుఁడు కవివతంసుఁడు. రసికాగ్రేసర చక్రవర్తి. ఇఁక నేమి? కవియు గణికయు బరస్పర గుణశ్రవణమున బద్ధానురాగులైరి. పూర్వజన్మకృత దుష్కృత వశమున నిరువురకును సంబంధ మేర్పడెను. అనవరతము రాకపోకలు జరుగుచుండెను.

ఇట్లుండ నొకనాఁటి రాత్రి కవి మాటల సందర్భమున 'రేపు మా యింటఁ బైతృక' మని చెప్పెను. అంతట వేశ్య 'అట్లయిన రేపు రాత్రి మీరు మా యింటికి రాగూడ' దనియెను. అనుటయే కాక రానని కవిచే గట్టి శపథ మొనరింపఁ జేసెను.

అయ్యది వర్షర్తువు. కుంభద్రోణములుగ వర్షించుచుండెను. మఱునాఁటి రాత్రి జాము ప్రొద్దు పోయినది. కృష్ణవేణీమతల్లి పొంగి పొరలుచుండెను. సూచికాభేద్యమగు గాఢాంధకారము నలుమూలల దట్టముగ వ్యాపించెను. హోరుగాలి 'భఱ్ఱు' 'భఱ్ఱు' న వీచుచుండెను. నదిని దాటించు నావ యావలియొడ్డున నుండెను. ఇది యంతయుఁ గన్నులారఁ గాంచుచుండిన కవి నిర్భయముగ నిలువెడలి వేశ్యాగృహమునకుఁ బయనమయ్యెను. 'కామాతురాణాం నభయం నలజ్జా' యనిగదా పెద్దల వచనము. కవితల్లజుఁ డెట్లో నదిని తరించి యావలితీరము జేరి యర్ధరాత్రమున కా గణికాగృహము జేరెను. ద్వారముకడ నిలఁబడి తలుపు తట్టెను. ఉచ్చైస్స్వరమున నా యువిదను బిలిచెను. కాని యామె లోపలనుండియే 'నీవు నీమముదప్పి శపథ భంగము సల్పితివిగానఁ దలుపు తీయుటకు వీలు లే' దని నొక్కి వక్కాణించెను.

కాని కామోద్రిక్తమానసుఁ డగు నా కవివరేణ్యుఁడు దొడ్డివైపునకు జేరి యున్నతమగు ప్రాకారకుడ్యము పైనుండి లోనికి దుమికెను. ఆ దుముకుటలో నచట కాలకర్మవశమున బఱుండియున్న యొక కృష్ణసర్పము తలపైఁ బాదము

పడెను. పాప మా త్రాచుపాము తల పగిలి చచ్చిపోయెను. కాలికిఁ బాము తగులుటచే కవి గుండె పగిలి 'యబ్బో!' యని పెద్ద కేకవైచెను. ముందున కెగిరి బురదనేలలో కాలు జారి తలక్రిందులుగఁ బెద్ద శబ్దముతోఁ బడెను.

ఆ సవ్వడి విని, కవి కామోద్రేకమునకు గణిక ప్రతీకార మొనర్పవలెనని యెంచెను. విగతవస్త్రయై దీపము చేతఁగొని వచ్చి యెదుట నిలఁబడెను. 'ఒక్కనాటికి మనసు నిలుపలేక నిట్టి యకార్యకరణ మొనర్చిన నీ చదువెందులకు? తగులవేయనా?' యని నిందించెను. ఆ దీపపు వెలుఁగున నసహ్యము పుట్టించు నా వేశ్యరూపమును, జచ్చి పడియున్న కృష్ణసర్పమును నొక్కమాఱుగఁ జూచిన కవికి, వేశ్యా విరక్తియు, గృష్ణభక్తియు నొక్కమాటే జనించెను. ఇఁక నచట నొక్క క్షణమైన నాగఁజాలక 'హా! కృష్ణా' యని యొక్క వెట్టికేక వైచి యటనుండి దొడ్డివాకిటఁ బయటఁబడి యదే పరువెత్తెను. అటకు యోజనద్వయ దూరమునఁ గల కృష్ణానదీతీరమున నున్న కృష్ణాపుర మను గ్రామము జేరెను. ఆ గ్రామమున నున్న గోపాలస్వామి యాలయముఁ జేరి తదాది యామరణము బ్రహ్మచారిగఁ గాలము గడపెను. భక్తియోగ మవలంబించెను. ఆ గోపాలస్వామిని గూర్చి భక్తిపారవశ్యమున గాన మొనర్చిన శ్లోకరాజములే కృష్ణ కర్ణామృత మయ్యెను. దీనినే యాతని శిష్యులు కంఠస్థ మొనర్చికొని దేశము నలుగడల వ్యాపింపఁజేసిరి. ఆ గ్రంథమే యిప్పటికిని భక్తిరసగ్రంథములందుఁ దలమానిక ముగ నెంచఁబడుచున్నది. ఇవ్విధమున జీవన్ముక్తి గాంచిన

బిల్వమంగళుఁడే లీలాశుకుఁ డని భక్తలోకమునఁ బ్రసిద్ధి గాంచెను.

ఈ భక్తిరస గ్రంథమునకు దరువాత ననేక వ్యాఖ్యలు వెలసినవి. అందొకదాని నాంధ్రుఁడగు నెల్లయసూరి రచించెను. ఉత్తర హిందూస్థానమున సుప్రసిద్ధుఁడగు రూపగోస్వామి శిష్యుఁడైన కృష్ణదాసు దీనికిఁ జక్కని టీక రచించెను. అయ్యది కర్ణానంద ప్రకాశిని యనుపేర వెలయుచున్నది.

ఇంకను ననేకు లాంధ్ర వ్యాఖ్యాతలు లీలాశుకుఁ డాంధ్రుఁ డనియే నిర్ణయించిరి. నిరాధారమగు నీ కవి కాలమును నిర్ణయించుట కయితి గాకున్నది.

మృదుపదగుంఫితమును, నతిమధురమును నగు నీతిని కవితాశైలి కవిలోకమున కొజ్జబంతి.

# 20. పండితరాయలు

ఈ మహాకవికి దలిదండ్రులు పెట్టిన నామము పండిత రాజ జగన్నాధకవి. పండితరాయ లనునది బిరుదనామము. ఈ బిరుదముతోడనే యీతఁడు సర్వత్ర వ్యవహరింపఁబడు చుండెను. ఈతని జన్మస్థాన ముభయగోదావరుల మధ్య నున్న ముంగొండ యగ్రహారము. ఈ యగ్రహార మిప్పటి కినిఁ బండితనిలయము. ఈ కవితల్లజు నింటిపేరు ఉపద్రష్ట వారు. ఈతని తలిదండ్రులు లక్ష్మీదేవి పేరుభట్టులు.

పేరుభట్టు పండిత శిరోమణి. వేదాంత పూర్వమీమాంసశబ్ద శాస్త్రాదులు కాశీపట్టణమున గూలంకషముగ నభ్యసించెను. మన పండితరాయలకు సర్వశాస్త్రములందును జనకుఁడే గురువు. ఈ పండితకవికి యవనయావని సంపర్క ముండెనని మనదేశమున నొకకథ ప్రచారమం దుండెను. ఉత్తరదేశమునఁ బ్రచారమందున్న కథ యిది!

పండితరాయలు తెలుఁగుగడ్డను జన్మించినను నుదర పోషణార్థము జయపురమునకు జని యట నొక సంస్కృత పాఠశాల స్థాపించెను. ఆ కాలమున నతఁడు యవనగ్రంథము లన్నియుఁ గూలంకషముగఁ బఠించెను. ఒకప్పుడు ఢిల్లీ పట్టణమునుండి కాజీ యనఁబడు తురుష్కవిద్వాంసుఁ డొకఁడు జయపురమున కేతెంచెను. పండితరాయ లాతనితో మత వాదమునకు దిగి యాతనిఁ బూర్తిగఁ బరాజితు నొనర్చెను. ఈ పండితప్రకాండుని విజయవార్త ఢిల్లీపాదుషా చెవినిఁ బడెను. పండితపోషకుఁ డగు నా పాదుషా యీ పండితునిఁ

దన యాస్థానమునకుఁ బిలిపించుకొని సత్కరించెను. సత్కరించుటయే కాక తన యాస్థాన కవిగ నియమించెను. ఆకాలముననే పూర్వకర్మవశమునఁ బండితరాయలు లవంగి యను నొక యవన కన్యనుఁ గామించెను. పాదుషా యాజ్ఞపై నా కన్యను బరిణయమాడెను.

కొంతకాలమున కాతఁడు తన యవన భార్యతోఁ గూడ కాశీక్షేత్రమున కేఁగెను. కాశీపండితు లితఁడు వర్ణభ్రష్టుఁడని గంగను తాకవల దని యాంక్షఁబెట్టిరి. అప్పుడీ కవిపండితుఁడు గంగాఘట్టములం దొకదానిపై మెట్టున నాశీనుఁడై గంగా స్తవము ప్రారంభించెను. మృదుమధురముగ నీతఁ డొక్కొక్క శ్లోకము జెప్పునప్పటికి గంగ యొక్కొక్క మెట్టు పైకి వచ్చి యేబదిరెండు శ్లోకము లగునప్పటి కీతనిఁ జేరి లవంగీ సమేతముగఁ దనలో లీన మొనర్చుకొనెను.

ఇఁక మన యాంధ్ర దేశమున నీతనిఁ గూర్చి ప్రచారమున నున్న కథ నారయుఁడు.

పండితరాయలు వింశతివర్ష ప్రాయుఁ డగునప్పటికే విద్య లన్నియు గడించెను. ధనార్జనాభిలాష మెండై నానా రాజ సందర్శన మొనర్చి వారి సభల నఖండ సత్కారము లందెను. అంత ఢిల్లీపాదుషా దాతృత్వమును, బండితాదరణమును గూర్చి విని 'ఢిల్లీశ్వరోవా జగదీశ్వరోవా మనోరథాన్ పూరయితుం సమర్థః' అని నిశ్చయించుకొనెను. హుటాహుటి ఢిల్లీకిఁ బయనమయ్యెను. కతిపయ ప్రయాణముల నా పట్టణము జేరి యూరిబైటఁ గల తటాకమున

స్నాన మాచరించుచుండెను. ఆ సమయమున నిరుపురు యవను లట పోరాడుకొని పాదుషాకడ నభియోగ మొనర్చిరి. వాది ప్రతివాదు లీ పండితవరేణ్యుని సాక్షిగఁ గొంపోయిరి. తనకు పార్సీభాష రాకున్నను వారి వాద మంతయు నున్నది నున్నయట్లు యథాశ్రుత మప్పగించెను. పాదుషా యీతని యద్భుత మేధాశక్తి కబ్బురపడి యీతనికి యవనభాషా పరిచయముగూడ నుండి యుండు నని యెంచి యాభాషను గల కురాను గ్రంథము నిచ్చి చదువు మనెను. అందు గొంత భాగమును దాను వినియున్నదానినిఁ జక్కఁగఁ జదివెను. పాదుషా యానందపరవశుఁడై యాతనిఁ దన యాస్థాని యందుఁ బండితునిగ నియమించెను. ఆ సమయమున పాదుషా నీకేమి కావలెనో కోరుకొను మనెను. అదే సమయమున స్వర్ణకలశము నొదలధరించి యొయ్యారముగ నీర మెత్తుకొని పోవుచున్న లవంగి యను లవలీలలితాంగిని జూచి మోహించి యామె నిప్పింపుఁ డని పండితుఁడు గోరెను. పాదుషా తన యాశ్రిత యగు నామె నిచ్చి పండిత రాయలకుఁ బరిణయ మొనర్చెను. ఉత్తర దక్షిణ దేశపు కథలకుఁ గొంత వ్యత్యాస మున్ననుఁ బండితునకు యవనస్త్రీ సంబంధ ముండె ననుట స్పష్టము.

ఆకాలమున నాంధ్రరాష్ట్రమున నప్పయ దీక్షితులను మఱియొక పండితవరేణ్యుఁడు గలఁడు. పండితరాయ లాతనితో వాద మొనర్పఁ దలఁచి వచ్చెను. కాని యితఁడు వర్ణభ్రష్టుఁడన్న నెపమున నప్పయదీక్షితులు ముఖము తప్పించి యెటకో పోయెను. ఆతని శిష్యు లాయన గ్రామాంతర మేఁగె

సని చెప్పిరి. పండితరాయలు కోపించి దీక్షితుల చిత్ర మీమాంసను ఖండించెనట.

ఈ పండితకవి పేరు బదుమూఁడు కృతులు గన్పట్టు చున్నవి. అందు భామినీవిలాసము సుప్రసిద్ధము. ఇంకను గొన్ని లహరులును గొన్ని విమర్శక గ్రంథములును గలవు. అన్నిటికన్న మిన్నగ నీతని రసగంగాధరము పండితాదర మును బొందఁ గల్గెను.

పండితరాయలు సూర్యోపాసకుఁడు. అద్వైతమతా వలంబి. యవనకన్యను బెండ్లాడినను యవనమతము మాత్రము స్వీకరింపఁ డయ్యెను.

జగన్నాథ పండితునకు సాహిత్యమందే కాక సంగీత మందును బ్రావీణ్యము గలదు. ఈతని గానమాధుర్యము నకు మెచ్చి షాజహాను ప్రభు వీతనికి రజతనాణెములతో తులాభార గౌరవ మొసంగెను.